

# గోమాత





గ్రంథ కర్త :
సుమ్నార్థి
(డా॥ కోడూరి సుబ్బారావు)

గాయత్రీ ఆశ్రమ ట్రస్టు ప్రచురణ

# గో మా త



"గావో విశ్వస్య మాతరః, గావః సర్వసుఖ ప్రదః"

కర్త :

**సుమ్నార్థి**

(డా ॥ కోడూరి సుబ్బారావు)

ప్రకాశకులు :

**గాయత్రీ ఆశ్రమము (ట్రస్టు)**

ఆర్యసమాజము-వ్యాస్‌నగర్, వారాసిగూడ, సికింద్రాబాద్. 500061

గాయత్రీ గ్రంథమాల - 13
పూర్వ ముద్రణలు : 6000
షష్ఠము ముద్రణ : 1000
సృష్టి సంవత్సరము : 197, 29, 49, 116
దయానందాబ్దము : 191
శ్రీ దుర్ముఖినామ సం॥ ఉగాది (8-4-2016)

మూల్యము : రూ. 40/-
(పోస్టు ఖర్చులు అదనము)

ప్రతులకు :

1. డా॥ కోడూరి సుబ్బారావు, వైదికవానప్రస్థాశ్రమం,
హనుమాపురం (B.O.) ; (Via.) భువనగిరి గంజ్ - 508 117.
సెల్ : 9908994084

2. గాయత్రీ ఆశ్రమ ట్రస్టు,
12-10-586/6, ఆర్యసమాజము, వ్యాస్‌నగర్
ఇందిరా నగర్ రోడ్‌నెం. 2, వారాసిగూడ - 500 061.

3. ఆరోగ్య రహస్య (స్వదేశీ కేంద్రం)
6-1-297/1, సాయిబాబా గుడి దగ్గర, పద్మారావు నగర్,
సికింద్రాబాద్ - 500 025. సెల్ : 98490 15638

4. ఆర్యసమాజము, మెయిన్‌రోడ్డు, సీతాఫలమండి - 500 061.

5. శ్రీ విద్యా బుక్ డిపో మరియు గోపాల్ బుక్ హౌస్,
ఆర్యసమాజము ఎదురుగా, సుల్తాన్‌బజార్, హైదరాబాద్ - 195.

6. ఆర్యసమాజము, కూచిపూడి - 522 313 (తెనాలి తాలూకా).
ఫోన్ : 08644-252789.

*Printed at :*

**PRINTSHOP** - 6632 0300.

# గోమాత స్తుతి



గావో లక్ష్మ్యా సదా మూలం
గోషు పాప్మా న విద్యతే ।
అన్న మేవ సదా గావో
దేవానాం పరమం హవిః ॥

(చ్యవన మహర్షి)

గోవులే అన్న ఆరోగ్య బలవీర్యాది సకల ఐశ్వర్యాలకు మూలం. పంచగవ్యాలైన గో క్షీర దధి ఘృత మల మూత్రాలందు ఎట్టి పాపమును (అపకారముచేయు తత్త్వమును) లేదు. గో సంతతియైన వృషభము వలననే అన్నము - పంటలు పండుచున్నవి. గాన అవియే అన్నదాతలు.

పృథివ్యాప్త స్తేజో వాయు రాకాశము లను పంచదేవతలను (భూతములను) పవిత్రపరచు యజ్ఞ యాగాదులలో గోఘృతమే శ్రేష్ఠమైనది.

# ప్రకాశకీయం

ఆది మానవసృష్టినుండి మహాభారతకాలం వరకు గోవు మాతగా పూజింపబడిన ఈ భారతదేశంలో నేడు సంవత్సరానికి కోటికిపైగా గోసంతతి వధించబడి వాటి మాంసం విదేశాలకు ఎగుమతి చేయబడుచున్నది. దీని వలన పశువుల ధరకూడా పెరిగిపోవుచున్నది. ఇప్పటికీ వ్యవసాయ గ్రామాలలో చిన్న రైతులకు యాభై మిలియన్ల ఎద్దులు అవసరముగా నున్నవి. ఇవి వ్యవసాయమునకేగాక ప్రయాణసాధనములుగా కూడా నుపయోగపడును. వీటి వలన మూడింట రెండు వంతుల చలనశక్తి లభించగలదు. కాని, గోమాంస రుచి మరిగిన విదేశీయులను తృప్తిపరచి భాగ్యవంతులు కాగోరు మన పారిశ్రామికవేత్తలవలన పశువుల ధర ఆకాశమునంటి చిన్నరైతులకు వ్యవసాయము చేయుటే కష్టమై పట్టణప్రాంతాలకు చేరుకొనగా, వారితోబాటు వ్యవసాయకూలీలుగూడా కూలినాలి కోసం పట్టణాలకు చేరుచున్నారు. తద్వారా పట్టణాలలో రద్దీ పెరిగి అనేక సమస్యలకు, వాతావరణ కాలుష్యమునకు కారణమగుచున్నది. వీటన్నిటినీ సరిచేయుటకు ఏకైక మార్గం 'సంపూర్ణ గోహత్యా నిషేధము' మనసా వాచా కర్మణా అమలు పరచుటయే!

ఈ స్వాతంత్ర్య ప్రజాస్వామ్య భారతదేశంలో ఓట్ల రాజకీయం రోజురోజుకూ పెరిగిపోయి ఓట్లకోసం, మైనారిటీల సంతృప్తికోసం, అధిక జనుల ఆవేదనను, దేశాభ్యుదయాన్ని విస్మరించి నేటి రాజకీయ నాయకులు సంపూర్ణ గోహత్యా నిషేధం అమలుపరచుటకు వెనుకాడుచున్నారు. ఇట్టి పరిస్థితులలో ప్రజలలో చైతన్యం కలగనిది, ప్రజల హృదయం స్పందించనిది ఈ సమస్య సమస్యగానే ఉంటుంది.

నేటి వైజ్ఞానిక యుగంలో ప్రతిదానిని వైజ్ఞానిక ప్రయోజనం దృష్ట్యా, ఆర్థిక ప్రయోజనం దృష్ట్యా అర్థం చేసికొనుచున్నారేగాని ప్రాచీన ఋషి–మునుల, మహాపురుషుల సందేశాలను అనుసరించలేకున్నారు. డా. సుమ్నార్థి కోడూరి సుబ్బారావు గారు పై విషయాన్ని దృష్టిలో పెట్టుకొని నేటి ప్రజల మనస్తత్వానికి నచ్చుజెప్పే విధంగా – తెలియజెప్పే విధంగా ఈ చిన్న గ్రంథాన్ని వ్రాశారు. వారి పూర్వ రచనల వలెనే ఈ **'గోమాత'** ను కూడా పాఠకులు ఆదరించి ప్రచారం చేయుదురని ఆశించుచున్నాము.

–ప్రకాశకులు

ఓ3మ్

# విషయసూచిక



**"గోమాతా విజయతామ్"**
**గోమాతయే మన రాష్ట్రీయపశువై**
**విజయమును బొందును గాక!**

# తొలి పలుకులు

ఓం ఇన్ద్రో విశ్వస్య రాజతి,
శం నో అస్తు ద్విపదే శం చతుష్పదే. (యజు. 36-8)

భారతీయార్యులు గోవును పూజించుచు, పవిత్రతకు ప్రతీకగ భావించుట సామాన్య విషయమే. కానీ, ప్రాచీన కాలంలో గోధనాన్నే ధనంగా భావించి ఎక్కువ గోవులను పోషించుటకు ప్రయత్నించేవారు. కాలక్రమంలో గోధన భూధనాలకన్న కరెన్సీ ధనాన్నే ధనంగా భావించటం జరుగుతూ వచ్చింది. దీనికి కారణం పాశ్చాత్య సంస్కృతీ ప్రభావం. నేడు సామాన్య ప్రజలలో గోభక్తి ఉన్నా ధనానికాశపడి గోసంతతిని కసాయివాళ్ళ కమ్మివేయడం జరుగుతూ ఉంది. దీనితోపాటు ప్రభుత్వం చేసే మాంసాహారప్రచారం, విలాసప్రియుల చర్మవస్తువుల ప్రియతముందు గోభక్తి నామమాత్రం అయిపోతూ ఉంది. నేడు ప్రజలు కేవలం ఆర్థిక ప్రయోజనాన్నే చూస్తున్నారు. గో పోషణ ఆర్థికంగా కూడా ప్రయోజనకరమేనని గుర్తింపచేస్తూ గోవు వలన కలిగే విశేష ప్రయోజనాలను వైజ్ఞానిక దృష్టికోణంతో వివరించి ప్రజలలో మార్పుతేవాలనే ప్రయత్నమే ఈ గ్రంథ ప్రచురణ.

హిందీ భాషలో శ్రీ పిండీదాస్ జ్ఞానిగారు వ్రాసి ప్రచురించిన 'గా-విశ్వకీ-మా' అను గ్రంథాన్ని చదివిన తదుపరి నేను ప్రభావితుడనై తెలుగు పాఠకులకొరకు వారు వివరించిన విషయాలతోబాటు మరికొన్ని ఉపయోగకర విషయాలనుచేర్చి వ్రాయాలని సంకల్పం కలిగింది. ఆరోగ్యం సరిగా లేకపోయినను చిరంజీవి జయరాజ్ మొదలగు వారు ప్రూఫ్‌లు దిద్దుటలో సహకరించగా, ప్రింట్‌షాప్ శ్రీ మాశెట్టి శ్రీనివాస్ ఆర్య గారు ముద్రణలో సహకరించగా ఈ చిన్న పుస్తకాన్ని తయారు చేయగలిగితిని. ఇది చదివి పాఠకులు ఏవైనా సూచనలు చేసిన మలి ముద్రణలో సవరించుకొన ప్రయత్నము చేయుదును. ఈ పుస్తకానికి గుప్తదానంగా రూ. 4,000/-లు లభించినవి. ఆ గుప్త దాతకు మా హృదయపూర్వక ధన్యవాదములు

బుధజన విధేయుడు
**-సుమ్నార్థి**
**(డా. కోడూరి సుబ్బారావు)**



# గోమాత

## (అమ్మవంటిదే ఆవు)

**"గావః విశ్వస్య మాతరః"** గోవులు విశ్వ మానవులందఱకు అన్ని వయసులవారికి పాలనిచ్చును గాన అవి తల్లివంటి వని ఆప్తవచనము.

గోవులు మన హిందువులని వ్యవహరింపబడు భారతీయార్యులకే గాక మానవమాత్రులందఱికి తల్లి వంటివి. బాల్యంలో తల్లి పాలు మన శరీరాన్ని పెంచి పోషించును. అందుచే మనకు తల్లి పట్ల స్పర్శభావన కలుగును. మమకార బంధమేర్పడును. మనం కొద్దికాలమే ఆ మాతృదుగ్ధమును గ్రోల గలుగుదుము. శిశువు వయసు పెరిగిన కొలది తల్లిపాలు తగ్గుచుండును. క్రమంగా యితర ఆహార పదార్థాలు తినుట కారంభించును. ఆరోగ్యదృష్టితో కూడా ఆరునెలల తదుపరి పాలు మాత్రమే సరిపోవు. కొంత ఘనాహారము – పిండి పదార్థాలు, మాంసకృత్తులు, క్రొవ్వులు మొదలగునవి అవసరమగును, అట్లని కేవలం అవియే సరిపోవు. వాటితో బాటు పాలు కూడా అవసర మగును. పాలు లేని యెంత పోషకవంతమైన ఆహారమైనను అసమగ్రముగాను, అసంతృప్తిగాను యుండును. పాలు ఆహారమును స్వాదిష్టము చేయును.

ఎదిగే పిల్లలకు, బుద్ధితో పని చేసేవారికి, విద్యార్థులకు, క్రీడాకారులకు, గర్భిణీస్త్రీలకు, పాలిచ్చు తల్లులకు పాలు చాలా అవసరము. జ్వరాదులలోను, జీర్ణకోశ బలహీనతలలోను పాలు తప్పక అవసరమగును. వారు వీరని యేల అందరకు పాలు యేదో ఒక రూపంలో – పెరుగు, వెన్న, నెయ్యి మొదలగు రూపాలలో అవసర మగుచునే యుండును. కనుక పాలు మానవ మాత్రులందఱకు, అన్ని వయసులలోను అవసరమగు ఆహారమే.

తల్లి రక్తం పాలుగా మారి శిశువున కాహార మగును. మఱల ఆ పాలు శిశువు శరీరంలో రక్తంగా మారును. అందుచే బంధువుల కంటెను,

తండ్రికంటెను కూడా తల్లి పట్ల యెక్కువ అనురాగ మేర్పడును, రక్త స్పర్శ యేర్పడును. అనగా తల్లి రక్తమే కొన్ని మార్పులతో మన రక్తంగా మారి శరీరంలో ప్రవహించు చుండును. అట్లే జంతువుల రక్తం కూడా పాలుగా మారి వాటి శిశువుల కాహారమగును. తదుపరి రక్తంగా మారును. జంతువులలో బుద్ధి వికాసము లేనందున ఆ మమకార బంధము, ఆ స్పర్శబంధము పాలు త్రాగు వయసువరకే యుండును. కాని, మానవులకు అది మరణపర్యంత ముండును. తల్లిపాలు మన శరీరంలో రక్తంగా మారినట్లే జంతువుల పాలు కూడా మన శరీరంలో రక్తంగా మారును. కనుక మనం యే జంతువుల పాలు త్రాగెదమో ఆ జంతువు యొక్క రక్తం కొన్ని మార్పులతో మన రక్తంగా మారి శరీరములో ప్రవహించుచుండును. కావున పాలిచ్చు జంతువులు మనకు తల్లివంటివి యగును.

మానవ జన్మ బహుమూల్యమైనది. వికసించిన పది యింద్రియాలతో బాటు అంతరింద్రియమైన మనసు కూడ వికసించి యుండును. సత్యా సత్యములను, ధర్మా ధర్మములను, కర్తవ్యా కర్తవ్యములను తెలుసుకొను బుద్ధి మానవునకు గలదు. జీవరాసులలో మానవుడు శ్రేష్ఠతమ ప్రాణిగా చెప్పబడును. మానవుడొక్కడే యున్న యెడల "శ్రేష్ఠతమ ప్రాణి" యని చెప్పుటకు వీలు పడదు. మఱి కొన్ని ప్రాణులతో పోల్చినప్పుడే "శ్రేష్ఠతమ" అను పదము మానవునకు వర్తించును.

మానవులంతా ఒక జాతి యగుదురు. అట్లే ఆవు జాతి, కుక్క జాతి, పిల్లి జాతి మొదలగునవి యేర్పడును. దీనినే ఋషులు "సమాన ప్రసవాత్మికా జాతిః" అని నిర్వచించిరి. ఒకే రకమైన ప్రసవము – అనగా తల్లి గర్భంలో పెరిగి ఆకారం గల శరీరం ధరించి ఒక క్రమంలో గర్భంనుండి బయటకు వచ్చుట. ఈ జీవ జాతులతో మన సంబంధము నాలోచించినప్పుడు కొన్ని ప్రాణులతో మనకు దగ్గఱ సంబంధమును, మఱికొన్ని ప్రాణులతో దూర సంబంధమును కలిగి యున్నట్లు తెలియగలదు. ఏ జీవరాసులు మనకు దగ్గఱ సంబంధము కలిగియున్నవో అవి మన జీవన నిర్వహణకు పరస్పర

సహకారులగును.

వేదములందు మూడు రకముల ప్రాణులు మానవునితో దగ్గఱ సంబంధం కలిగి యున్నట్లు చెప్పబడినది. అవి మొదటిది గో వర్గము, రెండవది అశ్వవర్గము, మూడవది శ్వ వర్గము. అందు మనకు పాలనిచ్చు జంతువులైన గోవు, గేదె, మేక, ఒంటె మొదలగునవి గో వర్గమునకు జెందును. ప్రయాణమున కుపకరించు గుఱ్ఱము, ఎద్దు, గాడిద, ఒంటె మొదలగునవి అశ్వ వర్గమునకు జెందును. మన యిండ్లయందు పెంచబడు కుక్క, పిల్లి మొదలగునవి శ్వ వర్గమునకు జెందును. ఇందు గో వర్గం మనకు అత్యంత సన్నిహితము, ఉపయోగకరము, ప్రియతమము, శ్రేష్ఠము నగును. ఎందుచేత ననగా వాటి పాలను త్రాగు చుండుటవలన వాటిపై మాతృభావన కలుగును. మనకు యితర జంతువుల అవసరమున్నను గో వర్గం ఎక్కువ అవసరమగును. అవి లేనిది మన జీవన నిర్వహణ అసంపూర్ణముగనే యుండును.

తల్లి మనకు పాలిచ్చి పోషించును. కనుక ప్రథమ దేవత యగును. అట్టి తల్లిని దేవునితో పోల్చిచూచిన దేవునితో సమానముగనే కనుపించును. ఋగ్వేదములో నొక చక్కటి భావన గలదు–

**వస్యాః ఇంద్రాసి మే పితురుత**
**భ్రాతు రభుఞ్జతః ।**
**మాతా చ మే ఛదయథః సమావసో,**
**వసుత్వానాయ రాధసే ॥** (ఋగ్వేదము 8–1–6)

ఓ పరమేశ్వరా! నీవు నా తండ్రితో పోల్చిన చాలా గొప్పవాడవు. మఱియు నా సోదరుని కన్నను గొప్పవాడవు. కాని, ఓ ప్రభో! నా తల్లితో పోల్చిన ఆమె నీవంటిదిగానే కనబడుచున్నది. ఎందుకనగా మీరిద్దఱు నాకు జన్మనిచ్చి పాలించుటయేగాక సదా నా యున్నతిని కోరుచుందురు.

పై మాతృభావం నుండి యొక మెట్టు దిగి గోమాతను మన తల్లితో పోల్చిన "ఓ తల్లీ! నీవు అశ్వము, కుక్క మొదలగు పశువు లన్నింటి కన్నను చాలా గొప్పదానవు. కాని, గోవుతో నిన్ను పోల్చిన నీవు గోవుతో సమానముగనే

తోచుచున్నావు. ఏలనన మీరిద్దరు నన్ను బాల్యంలో పాలించినవారే. నీవు ఒక వత్సరము పాలించిన గోమాత జీవిత పర్యంతము పాలించుచున్నది. అంతిమదశలో యే ఆహారమును జీర్ణము చేసుకోలేని మాకు గోక్షీరమే అమృత తుల్యము లగుచున్నవి."

పాలలో ఆవుపాలు శ్రేష్ఠతమమైన ఆహారం. అవి తల్లి పాలతో దగ్గఱ సంబంధం కలిగియుండును. అవి పోషకత్వముల పాళ్ళ సమానత కలిగి యుండును. అందుచే తేలికగా జీర్ణమై రస రక్తాలలో కలిసిపోవును. అందులోని సూక్ష్మతత్త్వములు బుద్ధిని వికసింప జేయును. మెదడులోని గ్రేమేటరు (Grey matter) ను పెంచును. శరీరమునకు కాంతినిచ్చును. అంతకన్నను సూక్ష్మతత్త్వము మనలో సత్త్వగుణమును, చురుకుతనమును కలిగించును. మఱియొక అద్భుత తత్త్వము రోగక్రిమి సంహారకముగను, విషనాశకముగను పనిచేయును. అందుచేతనే హిందువులని వ్యవహరింపబడు భారతీయార్యులు గోదుగ్ధ గుణములను గుర్తించి వాటిని తమ క్షీరావనరాలకు వినియోగించుకొనిరి. గో సంపదనే సంపదగా నెంచిరి. గో దానమునే శ్రేష్ఠదానముగా నెంచిరి. గో ఘృతముతో యజ్ఞాయాగాదులు చేసి భారతావనిని సస్యశ్యామల మొనర్చిరి. అందుచే భారతీయులకు గోవు పూజింపదగిన జంతువయ్యెను. గోమాత యయ్యెను.

పరమేశ్వరుడు యీ సృష్టిలోని పదార్థాలన్నిటిని యేదో ఒక ప్రయోజనం కొఱకే సృష్టించెను. ఒక్కొక్క వస్తువు వలన అనేక ప్రయోజనాలు కలుగును. వాటిని చక్కగా అధ్యయనం చేసి వాటి వలన ఆ యా ప్రయోజనాలను పొందుటయే బుద్ధి మంతుల కర్తవ్యము, న్యాయము నగును. విపరీతముగా వాని నుపయోగించుట వివేకహీనత, అన్యాయము నగును. ఏ ప్రయోజనాల కొఱకు నేత్రాలు రచింవబడినవో వానితో ఆ ప్రయోజనాలు నెరవేర్చుకొనవలయునేకాని దుర్వ్యసనాలతో వాటిని చెడగొట్టుకొనరాదు. పక్షపాతము విడిచి యాలోచింతుమేని గోవు మున్నగు పశువుల రక్షణవలన మానవ మాత్రులందఱకు చాలా మేలు కలుగను. వాటిని వధించి మాంసమును

భక్షించినచో బంగారు గ్రుడ్లను పెట్టు బాతును చంపి తినుటయే యగును.

ఋగ్వేదమునందు గో క్షీరముల వలన కలుగు విస్తృత లాభాలను తెలుపు చక్కటి వేదమంత్ర మొకటి కాననగును.

**యూయం గావో మేధయథా కృశంచిత్**
**అశ్రీరం చిత్ కృణుథా సుప్రతీకమ్,**
**భద్రం గృహం కృణుథ భద్రవాచో బృహత్**
**వో వయ ఉచ్యతే సభాసు.** (ఋ. 6-28-6)

ఓ గోమాతా! నీవు దుర్బలుని, కృశించిన వానిని హృష్టపుష్టునిగా జేయుదువు. శోభారహితుని చూడముచ్చటగా చేయుదువు. అట్టి నీవు మా గృహమును కళ్యాణకరము జేయుము. నీ గొప్పతనమును (గొప్పజీవనమును) మా సభలలో ఉచ్చస్వరముతో కీర్తింతుము గాక!

ఈ మంత్రంలో గోవు చేయు గొప్పప్రయోజనాలు వివరింపబడినవి. **'కృశంచిత్ మేధయథా'** – ఓ గోమాతా! నీవు కృశించిన వానిని పుష్టివంతునిగా చేయుదువు.

తల్లి గర్భంనుండి శిశువు కృశతాంగములతో బయటకు వచ్చును. తదుపరి మాతృదుగ్ధములతో పుష్టిని పొందును. అప్పుడు ఆ శిశువు అన్నముగాని, పండ్లుగాని తినలేకుండును. తల్లి పాలే అన్నము, పండ్లు యగును. అట్లే గోవులు, గేదెలు, మేకలు మొదలగునవి మాతృగర్భం నుండి కృశతాంగములతో బయటకు వచ్చి తమ తల్లి పాలవలన పుష్టిని పొందును. పెరిగిన తదుపరి ఆ జంతువులకు తల్లి పాలతో పని లేదు. గడ్డి గాదములను తిని పుష్టిని బొందును. మానవునికి గూడ పెద్దగానైన తదుపరి తల్లి పాలతో బనిలేదుగాని జంతువుల పాలు అవసరమగును. మనం ప్రపంచదేశాలను పరిశీలించిన పాలిచ్చు పశువులులేని దేశం కానరాదు.

కొన్ని ప్రాంతాలలో ఆవుపాలు విశేషముగా వాడుదురు. దక్షిణ భారత దేశం, నేపాలు మొదలగు చోట్ల గేదెల పాలు విశేషంగా వాడుదురు. పశ్చిమ ఆసియాలోనూ, భారతదేశం నందలి కొన్ని భాగాలందును మేకల పాలు

వాడుచుండుటయు గలదు. అరబ్బులు వారి దేశంలో ఒంటెల పాలు త్రాగుదురు. అందుచే వారికి ఒంటెలే గోవు లగును. ఎచట యే పాలు యెక్కువగా వాడుదురో వాటిని ఆ దేశపు గోవులుగా భావించి వాటిపట్ల మాతృభావన కలిగి యుండవలెను.

పాలు శరీరనిర్మాణమునకు అత్యవసరమైన ఆహారం. పాలయందు మాంసకృత్తులు, క్రొవ్వులు, కార్బొహైడ్రేట్‌లు, విటమిన్లు, సేంద్రియ లవణాలు, శరీర ఆరోగ్యమును వృద్ధిపరచు పోషక పదార్థాలు, విటమిన్లు గలవు. పాలయందలి మాంసకృత్తులయందు దేహనిర్మాణమున కవసరమగు ఎమైనోయాసిడులు గలవు. అవి చాలా తేలికగా జీర్ణమగు ఆల్బమిన్ రూపంలో నుండును. పాలయందలి క్రొవ్వు వెన్నరూపంలో సూక్ష్మాతి సూక్ష్మమైన కణాలుగా విభజించబడి యుండును. కనుక అతి సులభముగా జీర్ణమగును. పాలయందలి కార్బోహైడ్రేటులు అతి తేలికగా జీర్ణమగు లాక్టోస్‌రూపములో నుండును. ఈ లాక్టోస్ ఆహారంగాను, చిన్నప్రేవులలో లాక్టిక్ యాసిడ్‌గా మారి జీర్ణక్రియకును తోడ్పడును. పాలయందు విటమిన్ 'ఎ' అధికంగా గలదు. కనుక రోగనిరోధక శక్తిని పెంచి దేహమును వ్యాధులబారినుండి కాపాడును. ఇందలి 'బి' కాంప్లెక్స్‌తో నాడీమండలము బలపడును. 'డి' విటమిన్ వలన యెముకలు బలపడును.

పాలయందు కాల్షియం, పాస్ఫరస్, పొటాషియం, సోడియం అధికముగా నుండును. సున్నపునీటియందు కన్నను పాలయందు కాల్షియం యెక్కువగా నుండును. ఇందలి కాల్షియం పాస్ఫరస్‌లు అతితేలికగా జీర్ణమై శరీరధాతువులుగా మారిపోవును.

ప్రపంచమునందు అనేక చోట్ల పాలను ఆహారంగా నిచ్చి పరిశోధనలు జరిపిరి. ఇంగ్లాండు నందు ఒక గురుకుల పాఠశాలలో విద్యార్థులను రెండు వర్గాలుగా విభజించి ఒక వర్గము తీసుకొను ఆహారములో రోజు ఒక్కంటికి ఒక పైంటు (2 1/2 లీటర్లు) పాలు ఆహారముతో బాటు యివ్వగా ఒక సంవత్సరంలో 7 పౌన్లు బరువు, 2 అడుగుల 6 అంగుళముల పొడవు పెరిగిరి.

రెండవ వర్గమువారు (పాలు లేని రొట్టెలు, మాంసాదులు తినినవారు) ఒక సంవత్సరకాలంలో 3.85 పౌనుల బరువు ఒక అడుగు యెనిమి దంగుళాల (1. '8'ల) యెత్తు మాత్రవేు పెరిగిరి. ఈ ప్రత్యక్ష పరిశోధన ఆయుర్వేదాచార్యుడైన చరకుని మాటలకు సరిపోవుచున్నది. చరకుడు "పాలు శరీర ఎదుగుదలకు, బలసంపన్నతకు, జ్ఞాపకశక్తిని అభివృద్ధి పరచుటకు, నీరసమును తొలగించుటకు, దీర్ఘాయువునకు దివ్యౌషధము వంటి" వని చెప్పిరి.

దేశీయవైద్య విధానము నందు చికిత్సా పద్ధతులలో క్షీరచికిత్స యొకటి. క్షీర చికిత్సవలన నరముల బలహీనత, నీరసము, మలబద్ధము, అజీర్ణము, మూలశంక, నిద్రలేమి, జీర్ణాశయ వ్రణములు, సయాటికా మొదలగు రోగములు కుదురుచున్నవి. ఈ చికిత్సలో కేవలం పాలనే ఆహారముగా నిత్తురు. చికిత్సా కాలంలో రోగియందలి బాధలు తగ్గుటయేగాక బరువు కూడా పెరుగును. ధాతువులు బలపడును. ఆయుర్దాయం వృద్ధిచెందును. కనుక "యూయం కృశంచిత్ మేధయథా" అను వాక్యము అతిశయోక్తి కానేరదు.

**"అశ్రీరం చిత్ సుప్రతీకమ్ కృణుథా"** - ఓ గోమాతా! నీవు శ్రీరహితుని సుప్రతీకునిగా అనగా కురూపిని సుందరకాయునిగా తయారు చేయుదువు.

పరమేశ్వర నిర్మితమైన మానవశరీరం పశు పక్ష్యాదులతో పోల్చిన వాటికన్న బహుసుందరముగా నుండును. నిటారుగా నిలబడి నడుచుటయేగాక మానవుడు పరుగులెత్తగలడు. లయవిన్యాసములతో నాట్యమాడగలడు. తన హావభావములను చేతులతోనేగాక ముఖకవళికలతో కూడా వ్యక్తపరచగలడు. అట్టి సుందర శరీరముకూడా సరైన పోషణ లేనపుడు శ్రీరహిత మగును. కురూపిగా నగును. సౌందర్యం బయటి అలంకరణవలన లభించునది కాదు. అది పుష్టికరమైన ఆహారం ద్వారా లభించును. దానితోబాటు అనారోగ్యంలేని స్వస్థశరీరమై యుండవలెను. ఆరోగ్యం సరిగా లేనిచో మన సౌందర్యాన్ని సరిగా కాపాడుకొనలేము. సౌందర్యం ఆరోగ్యమును సూచించు చుండును.

ఆవుపాలయందు గల కెరటిన్ మన చర్మమును ప్రకాశవంతముగా

చేయును. ఆవుపాలయందలి క్రొవ్వు మనదేహమును పుష్టివంతము చేయుటయేగాక సుందరముగా తీర్చిదిద్దును. ముఖ్యంగా సౌందర్యం మన శరీరంలోని చర్మంక్రింద నుండు క్రొవ్వుపొరవలన ఏర్పడును. అట్లని క్రొవ్వు అధికముగా నున్నవారు సౌందర్యవంతులు కాకపోవచ్చును. ఆ క్రొవ్వు ఎచట ఎంత ఉండవలెనో అంతయుండిన ఆ అంగము సుందరంగా నుండును. ఆవుపాలవలన యేర్పడిన క్రొవ్వు అట్టి సమతుల్యతను కాపాడి సుందరమైన శరీరంగా తీర్చిదిద్దును. ధాతుశక్తిని పెంచి ముఖమునందు సౌందర్యమును పెంచును. ఇంద్రియ శక్తులను అభివృద్ధి పరచును.

**"భద్రం గృహం కృణుథా!"** ఓ గోమాతా! నీవు మా గృహమును కల్యాణకరము చేయుచున్నావు.

గోవు గృహమును శోభాయమానమెట్లు జేయును? గోవులున్న యిండ్లలో లేగదూడల అరుపులు గృహమును శోభాయమానము జేయును. గోదుగ్ధమును త్రాగిన ఆ ఇంటిలోని వారు బలారోగ్యములతో సుందరముగా నుందురు. శిశువులు గోవుల పాలను త్రాగి తృప్తిచెందుదురు. గోఘృతముతో జేసిన అగ్నిహోత్రము వలన ఆ ఇల్లు రోగరహిత మగును. ఆవుపేడతో అలికిన ఆ ముంగిలి ఇంటివారికి, చుట్టుప్రక్కలవారికి మేలుజేయును. అందుచేతనే పరాశర ఋషి తన గృహ్యాసూత్రములలో **"గృహ ప్రవేశ"** విధిని వివరించుచూ గృహ మెట్లుండవలెనో కొన్ని సూత్రములలో వివరించెను. గృహమును **"ఘృత ముక్షయమానా!"** అను విశేషణముతో జోడించెను. అనగా ఘృతమును (నేతిని) ఉత్పాదించునది యని దీని అర్థము. మరొక సూత్రములో

**"అశ్వావతీ గోమతీ సూనృతా వత్యుచ్ఛ్రయస్వ మహతే సౌభగాయ।**
**ఆత్వా శిశురాక్రన్దత్వా గావోధేనవో వశ్యమానాః"**

పారశ్కర గృహ్యాసూత్రాలు (3-4-4)

ఓ గృహమా! అశ్వములతో, గోవులతో, సత్యభాషణములతో కూడి నీవు నీ యజమానునికి సౌభాగ్యము జేయుము. ఈ ఇంట శిశువుల రోదనలతోబాటు ఆవుదూడల కేరింతలు, గోవుల సంతుష్టికరమైన అరుపులు

సదా వినపడుచుండును గాక! అని ఆదర్శగృహము యేది యగునో వివరించెను. గృహమును **"ఆత్వాపరిశృతః కుంభ ఆదధ్నః కలశైః"** గృహము పాలు పెరుగు వెన్నలతో నిండిన కలశములతో వర్ధిల్లు చుండవలెనని దీవించెను. కనుక గోవులు గృహమునకు కల్యాణకారకములు.

**'భద్ర వాచో బృహద్ వో వయ ఉచ్యతే సభాసు,'** ఓ గోమాతా! నీ గొప్పజీవన చరిత్రను మా సభలలో ఉచ్చస్వరములతో కీర్తింతుము గాక! గోవుల వలన ప్రయోజనము పొందుటయేగాక ఆ గో మహిమను సభలలో కీర్తింపవలయునని పరమేశ్వరుని ఆదేశము. దేనివలన మనం మేలు పొందెదమో దానిని స్తుతించకున్న కృతఘ్నుల మగుదుము. అంతేగాక, తోటివారి యున్నతికొఱకు మనం పొందిన లాభాలను వారి కుపదేశించుట మన కర్తవ్యం. మన పిల్లలకు, ప్రజలకు గోమాతపై శ్రద్ధ కలిగించవలెను. అప్పుడే ఋషి ఋణము తీరును. ఆ స్తుతించునపుడు 'బృహద్ ఉచ్యతే' అనగా గొప్పగా కీర్తించవలెనని పరమేశ్వరుని ఆదేశం. పరమేశ్వరుని దృష్టిలో గోవు యెంతటి మహత్వ పూర్ణమైనదో ఈ యొక్కమాట మనకు విశదీకరించు చున్నది. కనుక ఓ పాఠకులారా! పరమేశ్వరాదేశము పాటించి గోభక్తులమై గో మహత్వమును ప్రపంచమునకు చాటుదము రండు.

## వేదాలలో గో ప్రశంస

వేదం పరమేశ్వర వాణి. ఆది మానవ సృష్టిసమయమున పరమేశ్వరుడు సర్వోత్తమ ప్రాణిగా మానవుని సృజించి వికసిత జ్ఞానేంద్రియాలతో బాటు అంతరింద్రియమైన బుద్ధి నొసగి దానికి విషయంగా వేదము నుపదేశించెను. వేదములందు కేవల ఆధ్యాత్మిక జ్ఞానమేగాక మానవుడు ఉన్నతి పొందుటకు వలయు సాధనములన్నియు గలవు. అందు గోమహత్యము నుపదేశించు మంత్రములెన్నియో గలవు. వేదాలలో గోవునకు అదితి, ధేనువు, అఘ్న్యా మొదలగు పర్యాయపదములు గలవు. ఋగ్వేదంలో 723 సార్లు, యజుర్వేదంలో 87 సార్లు, సామవేదంలో 170 సార్లు, అథర్వవేదంలో 331 సార్లు మొత్తము 1311 సార్లు 'గో' శబ్ద ప్రయోగం గలదు. అట్లే 'అఘ్న్యా' పదము ఋగ్వేదంలో

20 సార్లు, యజుర్వేదంలో 5 సార్లు, సామవేదంలో 2 సార్లు, అథర్వణవేదంలో 33 సార్లు ప్రయోగింపబడినది. 'అఘ్న్యా' పదము కేవలము గోవు కొరకే. అఘ్న్యా అనగా హింసించరానిది యని అర్థము. 'ధేను' పదము ఋగ్వేదంలో 76 సార్లు, యజుర్వేదంలో 22 సార్లు, సామవేదంలో 25 సార్లు, అథర్వవేదమునందు 43 సార్లు ప్రయోగించబడినది. ధేనువు అనగా తృప్తిపరచునది అని మూలార్థము. 'అదితి' పదము కూడా గోవు కొఱకు వాడిన సందర్భములు కలవు.

ప్రకరణమునుబట్టి పై పదములకు వేరువేరు అర్థములున్నను పై లెక్కలన్నియు విశేషించి గోవుకొఱకు వాడిన సందర్భములే. ఉదాహరణ కొరకు కొన్నిటిని మనము పరిశీలింతము.

1. **సుయవసాద్భగవతీ హి భూయా అథా వయం భగవంతః స్యామ।**
**అద్ధి తృణా మఘ్న్యే విశ్వదానీం పిబ శుద్ధ ముదక మాచరన్తీ ॥**

(అథర్వ. 7-73-11)

హే అఘ్న్యే! ఓ హింసించరాని గోమాతా! నీవు మంచి యవాదులను భక్షించుచున్నావు. నీవు ఐశ్వర్యవతివి. అనేక సుఖముల నిచ్చుదానవు. అడవులలో, గ్రామములో సంచరించుచు, మాకు పనికిరాని గడ్డి గాదములను తినుచు, శుద్ధోదకమును త్రాగుచు మాకు బలవీర్యాది ఐశ్వర్యముల నిచ్చు పాల నిచ్చుచున్నావు.

2. **నమస్తే జాయమానాయై జాతాయ ఉత తే నమః ।**
**వాలేభ్యః శఫేభ్యో రూపాయాఘ్న్యే తే నమః ॥**

(అథర్వ. 10-10-1)

అఘ్న్యే! హింసించరాని ఓ గోమాతా! మాతృ గర్భంనుండి నీవు ప్రకటము కాగానే నీకు నమస్కరించు చున్నాము. నీ తోకకు, నీ గిట్టలకు కూడా మా ఆదర వందనములు. ఎందుచేతననగా నీవు పవిత్ర శరీరం కలిగి నీ దుగ్ధాదులతో మమ్ము రోగవిముక్తులను, బలవీర్యవంతులను జేయుచున్నావు. నీ మల మూత్రములు కూడా మాకు అనేక లాభములను చేకూర్చుచున్నవి.

3. **వశాం దేవా ఉప జీవన్తి వశాం మనుష్యా ఉత ।**
**వశేదం సర్వమభవద్ యావత్ సూర్యో విపశ్యతి ॥**

(అథర్వ. 10-10-34)

ఓ గోమాతా! నీవు దేవతలకు, మానవులకు, రాక్షసాది సర్వులకు నీ దుగ్ధముల నిచ్చి పోషించుచున్నావు. ఎంతవఱకు సూర్యకిరణములు ప్రసరించుచున్నవో అంతవరకు నీవు జనులను పోషించుచున్నావు.

4. **మాతారుద్రాణాం దుహితా వసూనాం**
**స్వసాదిత్యానా మమృతస్యనాభిః ।**
**ప్ర ను వోచం చికితుషే జనాయ మా గామనాగామదితి వధిష్ట ॥**

(ఋ. 8-101-15)

గోమాత రుద్రబ్రహ్మచారులకు తల్లివంటిది. వసుబ్రహ్మచారులకు పుత్రిక వంటిది. ఆదిత్య బ్రహ్మచారులకు సోదరి వంటిది. మఱియు గోవు అమృతనాభి. అనగా అమృతము లభించు కేంద్రము. ఓ వివేకవంతులైన మానవులారా! అట్టి నిరపరాధియు దుగ్ధాది అమృతములనిచ్చు గోమాతను హింసించకుడు.

వసుబ్రహ్మచారి యనగా 24 సంవత్సరములు వయసు కలిగి ఒక వేదము చదువుకున్నవాడు. రుద్రబ్రహ్మచారి యనగా 32 సంవత్సరముల వయస్సు కలిగి రెండు వేదములు చదువుకున్నవాడు. ఆదిత్యబ్రహ్మచారి అనగా 48 సంవత్సరములు వయస్సు గలిగి నాలుగు వేదములు చదువుకున్నవాడు. అట్టి బ్రహ్మచారులకు గోమాత తల్లిగా, పుత్రికగా, సోదరిగా వారిని పోషించుచుండును.

రుద్ర పదమునకు గల అనేకార్థములలో ప్రాణము అని ఒక అర్థము. వసు పదమునకు గల అనేకార్థములలో 'వాస' – అస్థి మాంసము మొదలగు శారీరక సంపద అని ఒక అర్థము. ఆదిత్య పదమునకు గల అనేకార్థములలో రక్తము, వీర్యము మొదలగు తైజసతత్త్వము లని ఒక అర్థము. అందుచే గో దుగ్ధాదులు మన శరీరములోని ప్రాణశక్తికి తల్లిగాను, మాంసాదులకు కుమార్తెగాను, వీర్యాదులకు సోదరిగాను ఉండి ఆ తత్వములను పోషించు

చుండునని అర్థము చెప్పుకొన వచ్చును.

కొన్ని ప్రశ్నలకు సమాధానములు : -

కిం స్విత్ సూర్య సమం జ్యోతిః?
కిం సముద్ర సమం సరః ?
కిం స్విత్ పృథివ్యై వర్షీయః?
కస్య మాత్రా న విద్యతే? (యజు. 23-47)

బ్రహ్మ సూర్య సమం జ్యోతిః
ద్యౌః సముద్ర సమం సరః ।
ఇంద్ర పృథివ్యై వర్షీయాన్
గోస్తు మాత్రా న విద్యతే ॥ (యజు. 23-48)

మొదటి మంత్రములో విద్వాంసులకు కొన్ని ప్రశ్నలు కలవు. రెండవ మంత్రములో వానికి సమాధానములు చెప్పబడినవి.

**ప్రశ్నలు :-**

1. సూర్యుని వంటి స్వప్రకాశముగల పెద్ద వస్తు వేది?
2. సముద్రము వంటి జలముగల మఱియొక స్థాన మేది?
3. పృథివివంటి విశాలమైన పెద్ద గోళ మేది?
4. దేని మాత్ర అనగా లాభముల పరిధి లెక్కించలేము?

**జవాబులు :-**

1. సూర్యుని వంటి పెద్ద ప్రకాశవస్తువు పరమేశ్వరుడు.
2. సముద్రము వంటి జలస్థానము అంతరిక్షము (అంతరిక్షము నందు జలము నీటియావిరిగా, తేమగా, మేఘములుగా నుండును.)
3. పృథివి వంటి విశాల గోళము సూర్యుడు.
4. దేని లాభములను గణించలేమో అది గోవు.

**6. సదా గావః శుచయో విశ్వధాయసః,**
**సదా దేవా అరేపసః.** (సామ. 442)

గోవులు సదా శుద్ధముగా పవిత్రముగా నుండును. సదా ప్రపంచ మానవులకు దుగ్ధాదులనిచ్చి హృష్టపుష్టులనుగా చేయుచుండును. ఎందుచేత ననగా దివ్యగుణయుక్త పదార్థాలు, వ్యక్తులు యెల్లప్పుడు నిర్దోషులుగా, శుద్ధులుగా నుందురు.

7. సంతానము, శరీరబలములకన్న గోవులను ముందుగా పొందగోరవలెను :-

**గావః సంతు ప్రజాః సంత్వథో అస్తు తనూ బలం ।**
**తత్సర్వ మను మన్యతాం దేవా ఋషభ దాయినే ॥**

(అథర్వ 9-4-20)

ఓ పరమేశ్వరా! మావద్ద గోవులు, సంతానము, శరీరబలము పుష్కళముగా నుండునుగాక! విద్వాంసులు మహావృషభమును గానము చేయువానిని గో ప్రజా బలములతో ఆశీర్వదించెదరు గాక!

8. గోవుకు మాతాపితరులతో సమాన స్థానము కలదు :-

**స్వస్తి మాత్ర ఉత పిత్రే నో అస్తు**
**స్వస్తి గోభ్యో జగతే పురుషేభ్యః ।**
**విశ్వం సుభూతం సువిదత్రం నో అస్తు**
**జ్యోగేవ దృశేమ సూర్యమ్ ॥** (అథర్వ 1-31-4)

మా తల్లిదండ్రులకు, గోవులకు, జగత్తున కుపకరించు మహాపురుషులకు సుఖశాంతులు ప్రాప్తించును గాక! సమస్త జగత్తు, పైన పేర్కొన్న పెద్దలు మమ్ము సుఖ విద్యాది సుశిక్షణలతో చిరకాలము జీవించుచు విశుద్ధ జ్యోతియగు పరమాత్మ దర్శనము చేయు మార్గమున మమ్ము నడుపుదురు గాక!

9. మాతృ వాత్సల్య ప్రతీక గోవు :-

**సహృదయం సాంమనస్య మవిద్వేషం కృణోమి వః ।**
**అన్యో అన్య మభిహార్యత వత్సం జాత మివాఘ్న్యా ॥**

(అథర్వ 3-30-1)

ఓ మానవులారా! మీరు విశాల హృదయులు, ఆలోచనాపరులు, ద్వేషరహితులు కాగోరుచున్నాను. ఒకరినొకరు నవజాత వత్సమును గోమాత వలె ప్రేమించుకొనుచు ఒకరి యున్నతికి మఱొకరు తోడ్పడుచు ఉన్నతిని బొంద గోరుచున్నాను.

10. గోవు ఐశ్వర్య ప్రదాయిని :-

**గావో భగో గావ ఇంద్రో మ ఇచ్ఛాద్ గావః**
**సోమస్య ప్రథమస్య భక్షః ।**
**ఇమా యా గావః స జనాస ఇంద్ర ఇచ్ఛామి**
**హృదా మనసా చిదింద్రమ్ ॥**

(అథర్వ 4-21-5)

గోవులే ఐశ్వర్యము. గోవులే యింద్రియ బలవర్ధకములు. గోదుగ్ధములే సోమరసము నందు కలుపదగిన భక్ష్యములు. కనుక ఓ మానవులారా! మనసుతో, హృదయముతో పరమైశ్వర్యయుక్త గోవులను పొంద గోరుడు.

11. గోవు తల్లి, పుత్రిక, సోదరివలె సహకరించుచు మన ఉన్నతిని గోరును :-

**మాతాదిత్యానాం దుహితా వసూనాం ప్రాణః**
**ప్రజానా మమృతస్య నాభిః,**
**హిరణ్యవర్ణా మధుకశా ఘృతాచీ మహాన్ భర్గశ్చరతి మర్త్యేషు ॥**

(అథర్వ 9-1-4)

గోవు ఆదిత్యులకు తల్లివంటిది. వసువులకు పుత్రికవంటిది. ప్రజలకు ప్రాణము వంటిది. గోవు మానవులకు అమృతము నిచ్చు నాభి (కేంద్రము). హిరణ్యవర్ణముతో మధువులను వర్షించు ఘృతాచి (నేతిని ఉత్పత్తిజేయు గోవు) మానవుల కష్టములను దూరము జేయుచు తిరుగాడుచున్నది.

12. సప్త మధువులలో రెండు మధువులు గో వృషభములు :-

**యో వై కశాయాః సప్త మధూని వేద మధుమాన్ భవతి ।**
**బ్రాహ్మణశ్చ రాజా చ ధేనుశ్చానడ్వాంశ్చ వ్రీహిశ్చ యవశ్చ**
**మధు సప్తమమ్ ॥** (అథర్వ 9-1-22)

ఎవరు ప్రజలను తనవైపు ఆకర్షితులను జేయు సప్త మధువులను తెలుసుకొందురో వారు ఉన్నతిని పొందుదురు.

సప్త మధువు లేవి యనగా :-

1. బ్రాహ్మణులు (విద్వాంసులు), 2. రాజులు, 3. గోవులు, 4. వృషభములు (ఎద్దులు), 5. వ్రీహిధాన్యము, 6. యవధాన్యము, 7. మధువు (తేనె).

## గోవు కామధేనువు

కామధేనువు, కల్పవృక్షము అనుమాటలు ప్రాచీన గ్రంథాలలో అచ్చటచ్చట కనబడుచుండును. ఇవి మనకు అతిశయోక్తులుగా గోచరించును. ఒకదాని మహత్త్వమును తెలుపుటకు అతిగా పొగడుటచే యిట్టి పొరపాట్లు జరుగుచున్నవి. కామధేను వనగా అనేక ప్రయోజనములను కలిగించు గోవు అనియు, కల్పవృక్ష మనగా బహుళ ప్రయోజనకారియైన వృక్షమనియు అర్థములు గ్రహించవలెను. ఆ దృష్టితో జూచిన గోవు బహుళ ప్రయోజనకారియైన కామధేనువు.

మహర్షి దయానందుడు తన "గో కరుణానిధి" అను లఘు గ్రంథమునందు ఒక్క ఆవు తన జీవిత కాలంలో 25,478 మనుజులను ఒక పర్యాయం తన పాలతో తృప్తి పరచగలుగునని లెక్కలు కట్టి వివరించిరి. ఆ గో సంతానంతో భావితరాలకు మరెంతో ప్రయోజనం కలుగుననియు, కోడెదూడల వలన వ్యవసాయాది పనులు నెరవేరుననియు, వాటి మల మూత్రాల వలన ఊసర క్షేత్రాలు ఉర్వర క్షేత్రాలగుననియు సప్రమాణికముగా నిరూపించిరి. అట్లే పాలనిచ్చు గేదెలు, ఒంటెలు, మేకలు, గొఱ్ఱెలు మొదలగు వాని వలన కూడా ఎంతో ప్రయోజనము కలుగుననియు, పాలిచ్చు

జంతువులలో గోవు సర్వోత్తమమైనదనియు నిరూపించిరి.

"పశువులు సారములేని గడ్డిగాదములు, ఆకు అలములు తిని జీవించుచు సారవంతములగు పాలు, నేయి మొదలగు రత్నముల నుత్పన్నము చేయును. ఎద్దులు వ్యవసాయాది పనులలో సహకరించి వివిధ ధాన్యముల నుత్పత్తి జేయును. వీని ద్వారా మానవుల జీవనము జరుగుటయే గాక బుద్ధి, బలము, పరాక్రమము, ఆరోగ్యము కలుగుచున్నవి. అవి సాధు జంతువులు. పుత్ర పుత్రికలవలె, మిత్రులవలె, మానవులను ప్రేమించును. ఎక్కడ బంధించిన అక్కడ కదలక మెదలక పడి యుండును. పారద్రోలిన దూరముగా పోవును. ఎటు నడిపిన అటు నడచును. వాటికి క్రూర జంతువుల వలన అపాయమెదురైన రక్షణ కొఱకు మన పంచన జేరును. అవి చనిపోయిన తదుపరికూడా మానవులకు తమ చర్మంతో పాదరక్షలు జేసికొనుటకు ఉపయోగపడుచు ప్రజలకు సేవ జేయును. అట్టి పాడిపశువులను చంపుట విశ్వాస ఘాతుకం కాదా?" అని మహర్షి ప్రశ్నించిరి. పాడి పశువులలో గోవుల వలన మిక్కిలి లాభములు కలుగును. అట్టి బహుళ ప్రయోజనకారియైన గోవును కామధేనువనుటలో అతిశయోక్తి యేమున్నది?

విశేషించి జలవాయువుల శుద్ధిజేయు నిత్యాగ్నిహోత్రంలో, వివిధ కామనలతో జేయు పుత్రకామేష్టి, వర్షేష్టి మొదలగు విశేష యజ్ఞాదులలో ఆవునేయి ప్రధాన హోమద్రవ్యంగా నుండును. వీటి పాలు, పెరుగు, వెన్న, నేయి, మల మూత్రాదులు వివిధ ఔషధాలలో భాగములుగా నుండును. వివిధ రోగములకు యివి పథ్యకారులు. కొన్ని రోగములకు ఇవి ప్రత్యేక ఔషధములు.

ఈ మధ్య రష్యాదేశపు ప్రఖ్యాత వైజ్ఞానికుడు డా. శిరోవిచ్ ఆవుపాలు, ఆవునేయి, ఆవుపేడ మొదలగు వాటిని గురించి చేసిన పరిశోధనల ఫలితాలు చాలా ఆశ్చర్యకరంగా నున్నవి. వారు యీ విధంగా వివరించిరి. "వీటికి రేడియోధార్మిక శక్తి నుండి రక్షణ కల్పించు శక్తి యెక్కువగా నున్నది. ఆవుపేడతో అలికిన ప్రాంతము రేడియోధార్మిక శక్తిని నిరోధిస్తున్నది. ఇంటిపైన ఆవుపేడతో అలికిన యెడల ఆ యింటిలోనికి రేడియోధార్మిక

శక్తి ప్రవేశించుట లేదు. ఆవునేతిని అగ్నిలో వేసిన దాని పొగ (యజ్ఞవాయువు) వలన వాయు మండలములోని రేడియేషన్ యొక్క ప్రభావము తగ్గిపోవుచున్నట్లు కనబడుచున్నది."

ప్రస్తుతం డా. శిరోవిచ్ రష్యాదేశంలో పంచగవ్యములైన ఆవుయొక్క పాలు, పెరుగు, నెయ్యి, పేడ, మూత్రాలపై పరిశోధన జేయుచున్నారు. వీటివలన అనేక రకాలైన చర్మవ్యాధులు పూర్తిగా నయ మగుచున్నవనియు, మరికొన్ని రోగాలలో కొంత నివారణ, కొంత ఉపశాంతి కలుగుచున్నదనియు, ఆరోగ్యవంతులు వీటిని సేవించిన నిరోగులై దీర్ఘజీవనము పొందగలరనియు చెప్పుచున్నారు.

మహాభారత అనుశాసనపర్వ 83వ అధ్యాయంలో ధనము కన్నను గోవు గొప్పదని వివరించుటకు వ్యాసమహర్షి అలంకార రూపంలో నొక కథను చెప్పెను–

ఒకసారి లక్ష్మీదేవి సుందర వస్త్ర ఆభూషణముల నలంకరించుకొని గోవుల మందలో ప్రవేశించెను. గోవులు ఆమె వైభవమును జూచి నీవు యెవరివో దయచేసి మాకు తెలుపవలసినదని కోరినవి. అపుడు లక్ష్మీదేవి "ఓ గోవులారా! మీకు శుభమగును గాక ! నేను ఈ లోకమున లక్ష్మిగా ప్రసిద్ధిని పొందితిని. మానవులందఱు నన్నే కోరుదురు. నా ఆశ్రయము వలననే దేవతలందఱు భోగముల ననుభవించు చున్నారు. ఋషులు సిద్ధిని పొందుచున్నారు. ధర్మార్థకామమోక్షములు నావలన సిద్ధించుచున్నవి. కాని, నేను మీ మధ్య నివసించ గోరుచున్నాను. అందుచే స్వయముగా మీ మధ్యకు వచ్చి మిమ్ములను ప్రార్థించుచున్నాను. అనుమతించుడు." అని కోరెను. దానికి గోవులు "ఓ లక్ష్మీదేవీ! నీవు చంచలమైనదానవు. ఒక చోట స్థిరముగానుండవు. నీవు అనేకులతో సంబంధము పెట్టుకొందువు. కనుక మామధ్య నీవు వసించవలదు. మరెక్కడనైననూ ఆనందముగానుండుము. మాకు గడ్డి గాదములే పుష్టినిచ్చుచున్నవి. నీతో మాకేమిపని?" యని చెప్పెను. అందుకు లక్ష్మీదేవి "యితరులకు మేలు చేయు గోవులారా! మీరు నన్ను త్యజించుటవలన లోకంలో

నేను అవహేళన పాలగుదును. ఉపేక్షింప బడుదును. కావున నాపై దయచూపుడు. మీరు గొప్ప ఐశ్వర్యదాతలు. ఎందరినో పోషించుచున్నారు. నేను మీ భక్తురాలను. మీ శరణుజొచ్చితిని. నాకు మీయందు చోటునిండు. కనీసము మీ శరీరములోని ఏ అంగమునందైనా, మలమూత్రాంగములందైనా సరే చోటు దొరికిన చాలునని కోరుకొనుచున్నాను. మీ అంగాలలో ఏదియును అపవిత్రమైనదికాదు. కనుక మీ అంగాలలో దేనియందు నాకు చోటునిత్తురో తెలుపు" దని ప్రార్థించినది. అప్పుడు గోవులన్నియు పరస్పరము ఆలోచించుకొని "ఓ లక్ష్మీదేవీ! నీవు శోభాయుక్తురాలవు. మేము నిన్ను సన్మానింపవలసినదే. నీవు మా మలమూత్రములలో వశింపుము. ఎందుచేతననగా మా మలమూత్రములు పరమపవిత్రములైనవి" అని చెప్పెనట. అప్పటినుండి శుద్ధిజేయుటకు వాడబడే గోవుల మలమూత్రాదులలో లక్ష్మీదేవి వసించుచున్నదట.

పై కథ అలంకారరూపములో గోవుల మలమూత్రములు కూడా పవిత్రములేననియు, వివిధ సంపదలకన్నా గోవులే శ్రేష్ఠతమములనియు తెలుపుచున్నది.

## ప్రాచీన చరిత్రలో గో ప్రశంస

ప్రథమ స్మృతికర్తయైన మనువు తన ధర్మశాస్త్రంలో గో మహిమను గొప్పగా కీర్తించిరి. అనేక ప్రాయశ్చిత్తవిధులలో గోమూత్రంతో శుద్ధిని విధించి యుండిరి. ఒక భూభాగమును శుద్ధిచేయవలెనన్న-

**'సమ్మార్జనోపాఞ్జనేన సేకేనోల్లేఖనేన చ ।**
**గవాఞ్చ పరివాసేన భూమిః శుధ్యతి పంచభిః'**

(మను 5-124)

ఆ భూభాగమును గోమయముతో అలికి, గోమూత్రము చల్లవలెను. ఆ భూమిపై ఒక రాత్రి, పగలు గోవును కట్టివేసి యుంచవలెను. అప్పుడు ఆ భూభాగము శుద్ధమగును.

మహాకవి కాళిదాసు రచించిన 'రఘువంశ మహాకావ్యం'లో గోమహిమను వివరించుటకు అలంకారరూపంలో (అతిశయోక్తిగా వర్ణించినను) సంతానంలేని దిలీపు మహారాజునకు గో సేవాశుశ్రూషల వలన సంతానం కలిగినట్లు గలదు.

దిలీపు మహారాజుకు పూర్వజన్మకృత పాపవశమున సంతానం కలుగలేదు. తన పట్టపురాణి సుదేష్ణతో కుల పురోహితుడైన వశిష్ఠుని ఆశ్రమానికి వెళ్ళి తనకు సంతానం కలుగు ఉపాయం తెలుపుడని ప్రార్థించెను. అందుకు వశిష్ఠుడు ' ఓ రాజా! ఈ అడవిలో సంచరించు నందిని అను గోవును శ్రద్ధా భక్తులతో సేవింపుము. దానివెంట నడుచుచు అది కూర్చున్న కూర్చొనుచూ, జలపానము చేసిన జలపానము చేయుచూ, ఆహారము తీసుకొనిన ఆహారము తీసుకొనుచు గడుపుము. దాని వలన నీకు సంతానము కలుగగలదని చెప్పెను. ఆ దంపతులిరువురూ అత్యంత శ్రద్ధా భక్తులతో ఆ నందిని గోవును 21 దినముల వఱకు సేవించిరి. పులి బారిన పడకుండ కూడా రక్షించిరి. దాని ఫలితంగా వారికి సంతానం కలిగెను. ఈ చారిత్రక కథవలన సంతాన హీనులు గోసేవ చేసిన సంతానం కలుగవచ్చుని తెలియుచున్నది. వాల్మీకి రామాయణంలో కూడా రఘు వంశజులైన రాజులు గోసేవ చేసినట్లు కనపడుచున్నది.

మహాభారతంలో శ్రీకృష్ణుడు చేసిన గోసేవా వర్ణనలు చాలా కలవు. అతని బాల్యం గోవుల మధ్యనే గడిచినది. తన మురళీ గానంతో గోవులను పరవశింపజేసి గోపాలు డను బిరుదును పొందెను. కంసుని రాజ్యంలో గోవధ జరుగుచుండెడిది. దానిని యెదిరించుటకు శ్రీకృష్ణుని మేనమామయైన రాయాణవైశ్యుడు పూనుకొని "రాధా" అను సంకేత నామంగల గోరక్షా సంఘమును స్థాపించి గోహత్యా నిరోధమునకు ఆందోళన గావించెడివాడు. తదుపరి ఆ బాధ్యతను శ్రీకృష్ణుడు స్వీకరించి కంసుని వధించి గోవులను రక్షించెను. ఇంతేకాని, 'రాధ' రాయాణ వైశ్యుని భార్యయైన స్త్రీ కాదు. భాగవతంలో శ్రీకృష్ణుడు గోమూత్ర స్నానం చేసినట్లుగా, గోధూళిని వంటికి రాచుకొని స్నానం చేసినట్లుగా వర్ణన కలదు.

మహాభారతంలో భీష్ముడు గోవును యజ్ఞస్వరూపంగా వర్ణించెను.

**"యజ్ఞాంగం కథితా గావో యజ్ఞ యేవ చ వాసవ ।**
**యేతాభిశ్చ వినా యజ్ఞో న వర్తేత కథంచన" ॥**

(అనుశాసన పర్వము 83-17)

"ఓ వాసవా! గోవు యజ్ఞమునకు ఒక అంగము. అంతేగాక సాక్షాత్తు యజ్ఞస్వరూపముగానే ఋషులు చెప్పెదరు. ఎందుచేతననగా వీటి పాలు, పెరుగు, నెయ్యి లేనిదే యజ్ఞము చేయుటెట్లు?" మరొకచోట అశ్వమేధయజ్ఞ సందర్భమున భీష్ముడు కపిల గో మహిమను వర్ణించుచు-

**పవిత్రం చ పవిత్రాణాం మంగళానాం చ మంగళమ్ ।**
**పుణ్యానాం పరమం పుణ్యం కపిలా పాండు నందన ॥**

(మ. భా. అశ్వమేధ-92)

"ఓ పాండునందనా! కపిలగోవు సమస్త పవిత్ర వస్తువులందు మొదటగా లెక్కించదగినది. మంగళకర వస్తువులలో ఎక్కువ కల్యాణకరమైనది. పుణ్యాజీవులలో పరమ పుణ్య జీవి" అని కీర్తించిరి. ఆ సందర్భముననే శ్రీకృష్ణుడు కపిల గో మహిమను యిట్లు వివరించెను.

**యస్యైతా కపిలాః సంతి గృహే పాప ప్రణాశినాః ।**
**తత్ర శ్రీర్విజయః కీర్తిః స్థితా నిత్యం యుధిష్ఠర ॥**

(మ. భా. అశ్వమేధ-92)

ఓ యుధిష్ఠరా! ఎవరి యింట కపిల గోవు వసించునో అచట శ్రీ (ఐశ్వర్యము), విజయము మఱియు విశాల కీర్తి నిత్యము ఆ యింట వసించుచుండును.

అనుశాసన పర్వంలో చ్యవన మహర్షి కథ గోవు యొక్క విలువను చాటుచున్నది. భృగు పుత్రుడైన చ్యవన మహర్షి జలములోనే వసించు దీక్షను గైకొని గంగా, యమునా నదులలో జలచరాలతో కలిసి వసించుచుండెను.

ఒకసారి మత్స్యములతో బాటు మహర్షి జాలరుల వలలో

చిక్కుకొనెను. జాలరులు క్షమాపణ వేడుకొని మీరు బయటకు వచ్చి మత్స్యములను మా కిమ్మని ప్రార్థించిరి. అందుకు ఋషి నేను వీటిని విడిచి ఉండలేను. కనుక నన్నుకూడా కలిపి ఎవరికైనా అమ్ముడని చెప్పెను. భయపడిన ఆ జాలరులు రాజువద్దకు పరిగెత్తి విషయమును వివరించిరి. మహారాజు నహుషుడు స్వయంగా వచ్చి మహర్షిని ప్రార్థించెను. అయిననూ మహర్షి తన మూల్యం జాలరులకు చెల్లించనిది నేను బయటికి రాలేనని చెప్పెను. అందుకు రాజు తమ విలువ యెంత? అని అడుగుచూ వందరూపాయల నుండి లక్షరూపాయల వరకు ఇచ్చుటకు తయారయ్యెను. అదియునూ సరిపోదని మహర్షి చెప్పెను. క్రమముగా తన అర్ధరాజ్యము, తన పూర్తి రాజ్యము యిచ్చుటకు రాజు సిద్ధపడెను. అదియునూ సరిపోదని మహర్షి చెప్పెను. అందుకు నహుషుడు మీరే మీ విలువను తెలుపుడని కోరగా విద్వాంసులను పిలిచి విచారించమని సలహా చెప్పెను. విద్వాంసులు యీ మహర్షి విలువ ఒక గోవుకు సమానమని చెప్పిరి. ఎందుచేతననగా గోవులు విద్వాంసులతో సమాన ప్రయోజనకారులనియు, వీటిని మించిన విలువైన వస్తువులు ప్రపంచమున లేవనియు చెప్పిరి. ఈ సందర్భంలోనే చ్యవన మహర్షి గోమహిమను వర్ణించుచు-

**గావో లక్ష్మ్యా సదా మూలం గోషు పాప్మా న విద్యతే ।**
**అన్నమేవ సదా గావో దేవానాం పరమం హవిః ॥**

(మ. భా. అనుశాసన 51-28)

గోవులే వివిధ ఐశ్వర్యములకు మూలము. గోవులందు యే కొద్దియును అపవిత్రమైనది లేదు. గోవులే మానవులకు ఎల్లప్పుడు అన్నమును, దేవతలకు హవ్యమును యిచ్చుచున్నవి. గోవుల మలమూత్రములవలన, గోవత్సములైన యెద్దులవలన వ్యవసాయాది పనులు నెరవేరి అన్నము ఉత్పన్నమగును. దివ్యగుణములు గల పృథివీ జల వాయు రాకాశాదులందు కలుగు దోషములను నివారించుటకు యజ్ఞాదులలో ఆవునెయ్యి అవసరమగును. పై దేవతలు యీ హవ్యము వలననే శుద్ధులగుదురు. ఇది వారికి ఆహారము.

మరెన్నో సందర్భాలలో మహాభారతమునందు గో ప్రశంస కనబడుచున్నది. విరాటపర్వంలో పాండవులు గోరక్షణచేసిన విషయం అందఱకు తెలిసినదియే కదా!

## మధ్యకాలీన చరిత్రలో గో ప్రశంస

మహాభారత యుద్ధానంతరం వేదప్రచారం సన్నగిల్లి వాటితోబాటు గోసేవా, యజ్ఞాదులు కూడా సన్నగిల్లినవి. అయినప్పటికి హిందువులని వ్యవహరింపబడు భారతీయార్యులలో గోభక్తి యుండెడిది. అందుచేత విదేశీయులు తమ రాజ్యము స్థిరపడుటకు, ఆందోళనలు లేవకుండుటకు భారతీయుల ఆచారములను కొన్నింటిని మన్నించెడివారు. ఈ విషయం మొగలాయి సామ్రాజ్యస్థాపకుడైన బాబర్ తన కుమారుడైన హుమాయూన్‌కు వ్రాసిన ఒక లేఖ వలన తెలియుచున్నది. ఆ లేఖ సారాంశ మిట్లున్నది–

"వరమాత్మునకు ధన్యవాదములు. ఓ పుత్రుడా! మన హిందూరాజ్యంలో వివిధ ధర్మావలంబులు నివసించుచున్నారు. భగవంతుడు ఆ రాజ్య శాసనము చేయు అధికారము నీ కొసంగెను. నీవు సాంప్రదాయక సంకుచిత భావాలకు తలయొగ్గక న్యాయంగా పరిపాలన చేయుచూ ముఖ్యంగా గోహత్య జరుగకుండా జాగ్రత్త వహింపుము. ఎందుచేతననగా అట్లు నీవు జేసిన హిందువులకు ప్రీతి పాత్రుడ వగుదువు. నీ శాసనంవలన వారు తృప్తి జెందుదురు. వారి మందిరములను, పూజించు వస్తువులను యెప్పుడును నష్టపరచవద్దు...." అని వ్రాసిరి.

హుమాయూన్ కూడా తండ్రిమాటను జవదాటక గోరక్షణ చేసెను. ఒకసారి ఈరాన్ వెళ్లుచుండగా ఒక రోజు తినుట కేమియు లభించలేదు. విచారించగా సమీపంలో తమ బంధు వొకరున్నట్లు తెలిసి వారింటికి తన నౌకరును పంపి ఆహారమును తెప్పించుకొనెను. అందు రొట్టెలు, కూరగాయలతో పాటు గోమాంసముకూడా ఉండుటను జూచి హుమాయూన్ క్రోధితుడై "ఓరి నీచుడా! నీ పొట్ట నింపుకొనుటకు ఈ పద్ధతేమిటి? గోమాతను

వధించుట ఎంత అపరాధము? మరి ఏ జంతువును నీకు దొరకలేదా?" అని గద్దించి అహారమును విసిరివేసి ఒక గ్లాసు షర్బతు మాత్రం త్రాగి నిదురించెను. మరునాడు సామాన్య శాకాహారమునే గ్రహించెను.

అక్బరు క్రీ.శ. 1586వ సంవత్సరంలో అప్పటి మౌల్వీలతో సంప్రదించి గోహత్యా నివారణ చట్టము చేసెను. అది యిప్పటికిని గ్వాలియర్ సంస్థానము నందు సురక్షితముగా నున్నది. దాని సారాంశం ఈ విధంగా నున్నది-

"ప్రతి జంతువు వలన యేదో ఒక లాభము యుండియే యుండును. వీనిలో గోవులు అత్యంత ఉపయోగకరమైనవి. ఎందుచేతననగా మానవులు, పశువులు ఆహారము తిని జీవింతురు. వ్యవసాయము చేయక ఆహారము లభించదు. నాగలి దున్నుటకు ఎద్దులు అవసరము. అది గో సంతతియే. అంతేగాక గోవులవలన మరెన్నో ప్రయోజనములు కలవు. సమస్త మానవుల, పశువుల జీవనాధారము గోవు యని స్పష్టమగుచున్నది. పై కారణాల వలన నా రాజ్యంలో గోహత్య పూర్తిగా నిషేధించబడవలెననికోరుచున్నాను. ఎవరైనా ఈ ఆజ్ఞను అతిక్రమించిన చేతివ్రేళ్ళు నరకబడును. ఉరిశిక్షకు గురిచేయబడుదురు."

జహంగీరు, షాజహాన్ కూడా యీ గోహత్యానిరోధ చట్టమును అమలు పరచిరి. ఔరంగజీబు మాత్రము మతాంధుడై యీ చట్టమును తీసివేయుటయే గాక అనేక స్థలములందు బాహాటముగా గోహత్యలను జరిపించెను.

శివాజీ బాల్యంలో మహమ్మదీయుల రాజ్యంలోనే గోమాంసమును విక్రయించుచున్న ఒక కసాయి వానిని చంపుట జరిగినది. యువకుడైన తదుపరి తన గురువైన సమర్థ రామదాసు ప్రేరణతో గో బ్రాహ్మణులను రక్షించుటకై "హిందూ పద పాదుషాహి" (మరాఠా రాజ్యమును) స్థాపించుట జరిగినది.

ఆంగ్లేయుల రాజ్యకాలంలో గోవధ మరింత వృద్ధి జెందినది. అంతేగాక, అవు క్రొవ్వుపూసిన తూటాలను హిందూ సైనికులకు యిచ్చెడివారు. వాటి పైపొరను పళ్ళతో పీకి నాలుకతో తడిచేసి తుపాకియందుంచి ఉపయోగించవలసి

వచ్చెడిది. హిందువుల కీపని యిష్టము లేకున్నను బలవంతంగా చేయించుచుండెడివారు. క్రీ.శ. 1857 లో మంగళపాండే అను బ్రాహ్మణ యువకుడు ఆంగ్లేయ సైన్యమందుండెను. అతను మరొక గ్రామము పయనించుచు దారిలో దాహమునకు గురియయ్యెను. సమీపంలోని ఒక బావివద్ద నీరు తోడుకొనుచున్న ఒక యువతిని మంచి నీరిమ్మని అడిగెను. అందుకు ఆ గో భక్తురాలైన సోదరి 'ఓ అన్నా! నీ నోటి నుండి, చేతుల నుండి గోవుయొక్క క్రొవ్వువాసన వచ్చుచున్నది. నీకు నీళ్లిచ్చి నాపాత్రను అపవిత్రము చేసుకుందునా?' అని ప్రశ్నించినది. ఈ మాటలు మంగళపాండ్య హృదయమునకు ఘాటుగా తగిలినవి. దానికి మహర్షి దయానందుని ప్రేరణ తోడై అతనిలోని ధార్మికభావాలు జాగృతమైనవి. పరిణామంగా తన శిబిరానికి వెళ్లి విప్లవమునకు ప్రయత్నములు చేసెను. దాని ఫలితమే 1857 సంవత్సరంలో మొదటిసారిగా ఆంగ్లేయ శాసనమునకు విరుద్ధంగా మొదటి తుపాకీ గుండు పేలినది. దీనిని బట్టి గోరక్షణార్థమే భారత ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామం ఆరంభమయ్యెనని తెలియుచున్నది.

మఱొక సంఘటన-క్రీ.శ. 1191 సంవత్సరంలో మహమ్మదు గోరి 25,000 అశ్వికదళంతో ఈరాన్ దేశం నుండి మన దేశంపైకి దండెత్తివచ్చెను. ఆ సేన ఢిల్లీ వైపు పయనించు చుండగా భటిండా దుర్గంలోని కేవలం 4,000 రాజపుత్ర సైనికులు (గో భక్తులు) మూడు నెలల వరకు ఢిల్లీ వైపు పోకుండా ఆపివేయగలిగిరి. ఈ లోపున ఆనాటి ఢిల్లీ సామ్రాట్టయిన మహారాజు పృథివీరాజు చౌహాను సేనలను తయారు చేసుకొని చిత్తోడ్‌ఘడ్ మహారాణా సమరసింహుని సహకారంతో అక్కడకు వచ్చి చేరెను. థాణేశ్వర సమీపమున సరస్వతీ నదీ తీరంలో తరవాజీ మైదానము నందు ఘోరయుద్ధము జరిగెను. అందు మహమ్మదు గోరి పరాజితుడగుటయే గాక బందీ అయ్యెను. ఢిల్లీలో దర్బారుకు తీసుకు రాబడిన గోరీతో పృథివీరాజ్ చౌహాన్ ఈ విధంగా పలికెను. "నీతో మేమెట్లు వ్యవహరింపవలెను?" అందుకు మహమ్మదు గోరీ చేతులు జోడించి, తల వంచుకొని, దీనవదనంతో, సిగ్గుతో "మహారాజా! నన్ను క్షమింపుడు. నేను మీ గోవునైతిని" అనెను. వెంటనే మహారాణా సమరసింహుడు ఆశ్చర్యంతో

"నీవు గోవువా?" అనెను. పృథ్వీరాజ్ చౌహాన్ జాలి తలచి "ఓ గోరీ మేము నిన్ను క్షమించితిమి. నీవు మా గోవువైతివని చెప్పుచున్నావు. హిందువులు యే గోవునకు కష్టము కలుగుట సహించలేరు. ఇక దండించుటెట్లు?" అని విడిచి పెట్టెను. వెనుతిరిగి జూడక గోరీ తన దేశమునకు పారిపోయెను. కాని, విశ్వాసఘాతకుడైన గోరీ పలుమార్లు భారతదేశంపై దండెత్తి దోచుకొనెను.

ఈ కథ వలన అంత మహాపరాధిని కూడా "నేను మీ గోవునైతి" నని చెప్పినంత మాత్రమున విడిచి పెట్టుట ఆనాటి వారి గోభక్తిని చాటుచున్నది.

ఆంగ్లేయుల పరిపాలన కాలంలో కూడా మహారాణా రణజిత్ సింహ, మహాదాజీ సింధియా మొదలగు సామంతరాజులు తమ సంధి పత్రాలలో ఆంగ్లేయ సైనికులు గోమాంసమును తిన్నను, గోహత్య చేసినను సైన్యం నుండి తొలగించు ఒప్పందం గావించుకొనిరి. తరువాత క్రమక్రమంగా భారతీయులలో గో భక్తి తగ్గుచు వచ్చుచున్నది.

## గోమేధ యజ్ఞము

వేదాలలో అనేక చోట్ల యజ్ఞమహిమ కీర్తింపబడినది. యజ్ఞము భారతీయ సంస్కృతిలో ఒక అంగము. ప్రతి శుభాశుభ కార్యములందును యజ్ఞము చేయుట అనివార్యం. గృహస్థులు ఉదయ సాయం సమయాలందు విధిగా దైనిక యజ్ఞం చేయవలెను. అంతేగాక వారి దృష్టిలో **"యజ్ఞో వై శ్రేష్ఠతమం కర్మ"** వేదవిహిత కర్మలలో యజ్ఞం ఉత్తమోత్తమమైనది. యజ్ఞం వలన సర్వప్రాణులకు మేలు జరుగవలెను. ఏ ప్రాణికి హింస జరిగినను అది యజ్ఞం కాదు. అందుచేతనే దీనికి "అధ్వర" మని మఱియొక పేరు. ఈ అధ్వర పదమును యాస్కమహర్షి యీవిధంగా నిర్వచించెను. **"అధ్వర ఇతి యజ్ఞనామ, ధ్వరత హింసాకర్మా, తత్ ప్రతిషేధః"** – అధ్వరమని యజ్ఞమునకు పేరు. ధ్వరతి యనగా హింసించుట అని అర్థము. దానికి వ్యతిరేకార్థముగా యెచట హింస లేశమాత్రముండదో దానికి అధ్వరమని పేరు. ఈ పేరే యజ్ఞంలో హింస జరుగకూడదని స్పష్టంగా తెలుపుచున్నది.

రాష్ట్ర సంక్షేమం కొఱకు, ప్రజాసంక్షేమం కొఱకు వివిధ కామనలు (కోరికలు) నెరవేరుట కొఱకు అశ్వమేధ, రాజసూయ, గోమేధ, పుత్రకామేష్టి, వర్షేష్టి మొదలగు యజ్ఞములు నిర్మింపబడినవి. అందు అశ్వమేధ మనగా దేశసంక్షేమం కొఱకు చేయు యజ్ఞము. రాష్ట్రమునకు అశ్వ మను పర్యాయపదము కలదు. **(రాష్ట్రం వై అశ్వః)** గోమేధ యజ్ఞమనగా భూమిలోని దోషాలను తొలగించుటకు చేసెడి యజ్ఞము. ఏ కారణం చేతనైన పంటపొలాలు నిర్వీర్యమైనపుడు వాటిని మరల వీర్యవంతం చేయుటకు యీ యజ్ఞం చేసెడివారు.

కాని, దురదృష్టవశాత్తు మహాభారత యుద్ధానంతరం మన దేశంలో వేద ప్రచారం సన్నగిల్లినది. వేద విద్వాంసులును కరువైరి. తత్ఫలితంగా వేద విరుద్ధమైన అనేక సాంప్రదాయాలు వెలసినవి. అందు తాంత్రిక సాంప్రదాయం ఒకటి. తాంత్రిక సాంప్రదాయంలో విచ్చలవిడిగా మద్య మాంస భక్షణం, వ్యభిచారం జరుగుచుండెడిది. ఈ తాంత్రికులు వేదమునకు విపరీతార్థములు వ్రాసి ప్రజలను తప్పుదారి పట్టించిరి. పశువులను చంపి యజ్ఞం జేయుట నారంభించిరి. గోమేధ, అశ్వమేధ, అజామేధ మొదలగు యజ్ఞములలో గోవులను, అశ్వములను, మేకలను చంపి ఆ మాంసాన్ని ఆహుతుల నిచ్చి యజ్ఞశేషముగ మిగిలిన మాంసమును ప్రజలకు ప్రసాదంగా పంచిపెట్టెడివారు. సామాన్యప్రజలు యిష్టం లేకున్నను ప్రసాదం తినకున్న పాపం వచ్చునని తినెడివారు. క్రమంగా అలవాటు చేసుకొనెడివారు. సోమరసమునకు బదులుగా మద్యము నాహుతులుగా నిచ్చి మిగిలిన మద్యమును యజ్ఞశేషంగా - ప్రసాదంగా ప్రజల చేత త్రాగించెడివారు. క్రమంగా వారు మద్యపానాసక్తు లయ్యెడివారు. వారి యీ దుష్టాచారములకు ప్రమాణంగా నుండుటకు సాయన, మహీధర ఆచార్యులచే వేదములకు విపరీత వ్యాఖ్యానములు వ్రాయించిరి. దాని ప్రభావం వలన గోమేధ యజ్ఞం అనేక గోవుల వధతో జరిగెడిది.

పృథ్వికి గల 21 పేర్లలో గౌ మొదటి పేరు (యాస్కనిఘంటువు 1-1). దీనికి యాస్కుడు నిరుక్తంలో యీ విధంగా నిర్వచించెను. **"గౌరితి**

**పృథివ్యా నామధేయమ్, యద్దూరం గతా భవతి, యచ్చాస్యానుభూతాని గచ్ఛంతి"** (నిరు. 2–5). అట్లే గోవుకు గల 9 పేర్లలో మహీ అనునది ఒకపేరు. మహీ అనగా మాతృభూమి అని యర్థం. "మేధమ్" అనగా పవిత్రపరచుట, వృద్ధి పరచుట అని అర్థం. "గోమేధమ్" అనగా భూమిని శుద్ధి జేయు ఒక యజ్ఞప్రక్రియ.

గో పదమునకు యింద్రియములు, సూర్యకిరణములు, గౌలోమి యను మూలిక మొదలగు అర్థములుకూడా కలవు. ఆ యా ప్రకరణములను, ప్రసంగములను బట్టి అర్థమును గ్రహించవలసి యుండును. ప్రాచీన కాలంలో ఋషులు గోమాంసమును తినెడివారని చేసిన ప్రచారం కూడా సత్యం కాదు. వేదం మాంసాహారమును పూర్తిగా నిషేధించును. ఎవరును యెట్టి పరిస్థితులలోను మాంసం తినకూడదని వేద మాదేశించును. తాంత్రికుల ప్రభావం వలన యిట్టి అవైదిక కల్పనలు జరిగినవి. వీటి నెదురించుటకై చార్వాక జైన బౌద్ధమతాలు ఉద్భవించినవి. సర్వదర్శన సంగ్రహ కర్తయైన విష్ణుశర్మ యీ విధంగా ప్రశ్నించెను.–

**"పశుశ్చే న్నిహితః స్వర్గం జ్యోతిష్టోమే గమిష్యతి**
**స్వపితా యజమానేన తత్ర కస్మాన్న హింస్యతే."**

అనగా జ్యోతిష్టోమాది యజ్ఞములలో చంపబడిన పశువు స్వర్గమున కేగిన మరి వృద్ధులైన మీ మాతాపితలను యజ్ఞములో బలిచేసి స్వర్గమున కేల పంపరు?

అహింసా మూర్తియైన బుద్ధుడు ఒక చోట తన ఆవేదనను పాలీ భాషలో యిట్లు వ్యక్త పరచెను.

**"అన్నదా బలదా చేతావణ్ణాదా సుఖదా తథా**
**యేతమత్థవసం ఇత్వానాస్సుగావో హసిం సుతే**
**నా పాదా నావిసానేణ నాస్సుహింసంతి కేనచ**
**గావో ఎళక్ సమానా సారతకుంభదుహన**
**తదిసణ్ణే గహే త్వాణ రాజా సత్యేధ ఘాతయి"**

"అనగా పూర్వ కాలమున బ్రాహ్మణులు అన్నము, బలము, కాంతి మఱియు సుఖమునిచ్చు గోవును యెప్పుడును హింసించెడి వారు కాదు. కాని, నేడు కుండలకొలది పాలనిచ్చు, ఎవరికిని తన పాదములతోను, కొమ్ములతోను అపకారమొనర్చని మేకవంటి సాధు జంతువైన గోవును గోమేధ యజ్ఞం పేరుతో బలిచేయుచున్నారు. ఇది ఎంత ఘోరము."

మహాభారతము నందలి శాంతి, అనుశాసన పర్వములలో కూడా యజ్ఞములో పశుబలి చేయకూడదని చెప్పబడినది.

## గోహత్య నరహత్యతో సమానము

**యది నో గాం హంసి యద్యశ్వం యది పూరుషమ్ ।**
**తం త్వా సీసేన విద్యామో యథా నోఽసో అవీరహా ॥**

(అథర్వ 1-16-4)

ఎవరు గోవును గాని, అశ్వమును గాని, మానవునిగాని చంపుదురో అట్టి ఘాతకులను తుపాకి గుండుతో చంపి మరల అట్టి ఘోరములు జరుగకుండ జాగ్రత్త వహించవలెను.

**విషం గవాం యాతుధాన భరంతామా వృశ్చంతా**
**మదితయే దురేవాః ।**
**పరైణాన్ దేవః సవతా దధాతు పరా**
**భాగమోషధీనాం జయంతామ్ ॥**

(అథర్వ 8-3-16)

ఎవరైనా దుర్మార్గులు గోవులకు విషమిచ్చినగాని లేక వాటిని చంపినగాని రాజు వారి సర్వ సంపదలను, సర్వస్వమును హరించి అన్న ఔషధములకు దూరము చేసి చంపవలెను.

ఇట్టి, ఆదేశములు వేదములందు చాలా గలవు. స్మృతిగ్రంథములలోను, ఇతిహాసములోను యిట్టి ఆదేశములు అనేకము లభించును. మానవప్రాణి

యెంత ముఖ్యమో, ఆ మానవ ప్రాణుల జీవనం దేనిపై ఆధారపడి యున్నదో అట్టి గోవును అంతయే ముఖ్యమగును. అందుచేతనే గో హత్యను మహాపాతకములలో నొకటిగా మన పెద్దలు చేర్చిరి.

## మహర్షి దయానందుడు - గోమాత

దయామూర్తియైన మహర్షి దయానందుడు అనన్య గోభక్తుడు. ఆయన గోవును ఆర్యసంస్కృతి యొక్క ప్రతిష్ఠగా భావించెను. మానవ జీవనము గోవుతో ముడిపడి యున్నదని ఆయన నిరూపించెను. మహాత్మాగాంధీ రాట్నములో భారతీయ స్వరాజ్య దర్శనమును, భారతీయ ఉన్నతిని దర్శించగా మహర్షి దయానందుడు గో సంరక్షణలోనే స్వరాజ్యదర్శనమును, మానవ ఉన్నతిని దర్శించెను. గోసేవ వలన ఆహారముతో బాటు వస్త్రములకు మూలమైన పత్తియును లభించును. అన్నిటికన్నామించి వేదాదేశములకు దయానందుడు మొదటిస్థాన మిచ్చును. వేదములందు వర్ణింపబడిన గో మహిమయే వారికి ఈ ప్రేరణనిచ్చినది. 19వ శతాబ్దంలో తన "గోకరుణానిధి" యను లఘు గ్రంథంలో గో మహిమను లోకమున చాటిన మొదటి ఆచార్యుడు దయానందుడు.

ఆ గ్రంథమునందు కేవలం గోసంరక్షణకొరకే గాక సమస్త పాడి పశువుల సంరక్షణకు ప్రేరేపించిరి. పాడిపశువులపట్ల మాతృభావన కలిగి యుండవలెననియు, అవి ముసలివైనను మన ముసలి తలిదండ్రులను సేవించునట్లు సేవించవలెననియు, లేకున్న కృతఘ్నుల మగుదుమనియు హెచ్చరించిరి. పరమేశ్వరుడు అన్ని ప్రాణులను యేదో ఒక ప్రయోజనం కొరకే సృజించెననియు, వాటివలన ఆ ప్రయోజనం పొందుట ధర్మమగును గాని వాటిని హింసించి, చంపి విపరీతముగా నుపయోగించుకొనుట బుద్ధిమంతులకు ధర్మంకాదని వివరించిరి. మాంసాహారుల సందేహములకు, కుయుక్తులకు చక్కటి హేతుబద్ధ సమాధానము లొసగిరి. పశువును తాను స్వయముగా చంపకున్నను తినువాడు, వండువాడు, వడ్డించువాడు మొదలగు

యెనమందుగురు పాపభాగులగుదురని మనుధర్మశాస్త్రంలోని ఈ క్రింది శ్లోకము నుదహరించి వివరించిరి.

"అనుమంతా విశసితా నిహంతా క్రయవిక్రయీ ।
సంస్కర్తా చోపహర్తా చ ఖాదకశ్చేతి ఘాతుకాః" ॥

(మనుస్మృతి 5-51)

జంతువును చంపుమని చెప్పువాడు, హింసించువాడు, చంపువాడు, మాంసమును కొనువాడు, అమ్మువాడు, మాంసమును వండువాడు, వడ్డించువాడు, తినువాడు ననుయెనమండుగురును హింసకులే – పాపభాగులే.

ఒకనాడు మహర్షి దయానందుడు గోరక్షణవిషయము నుపదేశించు చుండగా కొందరు ఫాదరీలు స్వామిని చూడవచ్చిరి. వారిలో జోన్స్ అను ఫాదరీని "దేనిని మంచిపని యందుర"ని స్వామి ప్రశ్నించిరి. దానికి జోన్స్ మీరే వివరించుడని కోరెను. ఏ పనివలన అధిక మానవులకు అధిక ప్రయోజనము కలుగునో ఆ కర్మను మంచిపని అందురని వివరించిరి. ఆ సిద్ధాంతమును తాను కూడా అంగీకరింతునని జోన్స్ చెప్పెను. అప్పుడు స్వామి గోవు వలన కలుగు లాభములను సోదాహరణముగా వివరించి చెప్పిరి. ఆ యుపదేశమును విని జోన్స్ "నేటినుండి గోమాంస భక్షణము త్యజించుచున్నా"నని అక్కడనే ప్రతిజ్ఞ చేసెను.

కర్నల్ బ్రూక్ అను ఆంగ్లేయుడు గవర్నర్ జనరల్‌కు ఏజంటుగా నుండెడివాడు. అతనికి సాధు సంన్యాసులనిన గిట్టదు. కాని, ఒక ఉద్యానవనములో స్వామి దయానందుని చూచిన వెంటనే అతనికి శ్రద్ధ ఏర్పడెను. తన బంగ్లాకు రమ్మని ఆహ్వానించెను. మరునాడు అతను పంపిన బండిలో దయానందస్వామి రామస్వరూపు అను శిష్యుని వెంటబెట్టుకొని బ్రూక్ బంగ్లాకు వెళ్ళెను. అచట అనేక విషయములతోబాటు గోవుల వలన కలుగు లాభములను గోహత్యవలన కలుగు నష్టములను స్వామి వివరించి చెప్పి గోవధను మాన్పించుమని బ్రూక్‌ను కోరెను. దానికి కర్నల్ బ్రూక్ "స్వామీ! మీరు చెప్పినవన్నీ నేను అంగీకరింతును. గోవధను మాన్పించగల అధికారము

నాకు లేదు. నేను మీకొక పత్రము వ్రాసి యివ్వగలను. మీరు గవర్నర్ జనరల్‌తో కలసి సంభాషించుడు. నా ఈ పత్రము చూచిన ఇతర అధికారులు కూడా మిమ్ములను సన్మానింతు" రని ఒక పత్రము వ్రాసి ఇచ్చెను.

ఒకసారి తమ స్వదేశమునకు వెళ్ళుచున్న లాట్‌మ్యోర్ మఱియు కమసన్ అను ఆంగ్లేయాధికారులతో దయానందస్వామి "మీరు ఇంగ్లాండునకు వెళ్ళి అచట భారత మంత్రాలయ సమావేశంలో పాల్గొనునపుడు భారత హితమును మనసులో నుంచుకొని గోవధను మాన్పించుటకు ప్రయత్నించు" దని కోరెను.

మానవ మాతృలందఱకు నుపకరించు గోమాతలను రక్షించుటకు విశేషించి "గోవధ నిషేధ" శాసనము తెచ్చుటకు స్వామి దయానందుడు విశేష కృషి చేసెను. లక్షలాది భారతీయుల సంతకములతో విక్టోరియా మహారాణికి సమర్పించుటకు ఒక వినతి పత్రమును తయారు చేసెను. దురదృష్టవశాత్తు విషప్రయోగమునకు గురియై తీవ్ర అస్వస్థతపాలై ఆ వినతి పత్రమును విక్టోరియా మహారాణికి సమర్పించకుండగనే దయానందస్వామి స్వర్గస్థులయ్యారు.

తదుపరి దయానందస్వామి శిష్యులైన ఆర్యసమాజీకులు ఆ పత్రమును సమర్పించుటకు ప్రయత్నించగా మహాత్మాగాంధీ, సర్దార్ పటేల్ మొదలగు స్వాతంత్ర్య సమరయోధులు ప్రజల దృష్టిని స్వరాజ్యలక్ష్యంనుండి మరల్చవద్దనియు, స్వాతంత్ర్య సముపార్జనానంతరం ఒక్క కలం పోటుతో "గోవధనిషేధ శాసనం" తీసుకురాగలమనియు హామీ యిచ్చి ఆపుచేసిరి.

మహర్షి దయానందుని రచనలతో ప్రభావితులైన మహాత్మా గాంధీ హరిజనోద్ధరణతో బాటు, గోసంరక్షణకుకూడా ప్రయత్నించిరి. గోసేవా సంఘమును స్థాపించి జాతికి గోసేవను ప్రబోధించిరి. కాని, గాంధీజీ వారసులైన నేటి కాంగ్రెస్ నాయకులు యీ పుణ్యకార్యమును అవహేళన జేసిరి. బొంబాయి, కలకత్తా వంటి నగరాలలో కోట్లాది రూపాయల వ్యయముతో ఆధునిక కబేలాలను నిర్మించుటకు అనుమతి నిచ్చిరి. అచ్చట ప్రతిరోజు సుమారు

5,000 గోవులు వధింపబడి వాని మాంసము డబ్బాలలో విదేశములకు యెగుమతి చేయబడుచున్నది. ప్రపంచమునకు గోసేవను బోధించవలసిన యీ స్వతంత్ర భారతదేశము నే డీ పాపిష్టి పని చేయుట లజ్జాకరము.

మహర్షి దయానందుని కృషి వలన దేశంలో వందలాది గోశాలలు, పశుశాలలు స్థాపించబడినవి. ఆర్యులు ఎన్నో గోరక్షణాందోళనలు చేసి యెన్నెన్నో త్యాగములు చేసిరి. ఆర్యులు నిర్మించిన గోశాలలు నామమాత్రంగా యేర్పడినవి కావు. ఆదర్శ దుగ్ధశాలలుగా, గో సంవర్ధన కేంద్రాలుగా ప్రసిద్ధి జెందినవి.

మహర్షి దయానందుడు తాను వ్రాసిన వేదభాష్యంలో సందర్భం వచ్చినప్పుడల్లా గోమహిమను వివరించుచు గోసేవను ప్రబోధించెను. వేదాలలో అనేకచోట్ల గోవును ఉపమానముగా జూపి రాజులు, ప్రజలు గోవులవలె పరోపకార పరాయణులు కావలెనను ప్రబోధములు కలవు.

## నేటి గోమాత విలాపము

ఏ దేశమున గోవు తల్లిగా పూజింపబడినదో, ఏ దేశమున వేదములు, ఋషిమునులు గోమహిమను గొప్పగా కీర్తించిరో, ఎచట గోసంపదనే యథార్థ సంపదగా గౌరవించిరో ఆ భారత దేశమున నేడు గోమాత హృదయ విదారకముగా విలపించుచున్నది. గోమాంసంతో బాటు చర్మము కొఱకు ఆధునిక కబేళాలలో గోవును (గోసంతతిని) క్రూరాతి క్రూరంగా హింసించుచున్నారు. గోవులు సమృద్ధిగా పాలనిచ్చువఱకు, యెద్దులు చక్కగా పొలముదున్నువఱకు వాటిని తమ స్వార్థమునకు వినియోగించుకొని అవి ముసలివైన వెంటనే నిర్దయులైన మానవులు వాటిని కసాయివారి కమ్ముదురు. వారు కొన్ని మందలను కూడబెట్టి పెద్దపెద్ద కబేళాల కమ్ముదురు. ఆ కబేళాలలో ముఖ్యంగా విద్యుత్‌తో నడుచు ఆధునిక కబేళాలలో కొన్ని రోజుల వఱకు వాటిని ఆకలితో దాహంతో అలమటింప జేయుదురు. (వేల గోవులను మేపుటకు గడ్డి అచ్చట యెక్కడ ఉండును?) వ[illegible]

పైపుల మధ్య బంధించి వాటిపై సలసల మరుగు వేడినీటిని పోయుదురు. అందువలన వాటిచర్మంపైనున్న వెంట్రుకలు కాలిపోయి రాలిపోవును. చర్మము ఉబ్బును. మరింత ఉబ్బుటకు యంత్రసహాయంతో కట్టె బండలతో బాదుదురు. ఆ ఉబ్బిన చర్మమును గోవు బ్రతికియుండగనే వలిచెదరు. తదుపరి వాటి శరీరంలోని రక్తమునంతను చివరి రక్తపుబొట్టు కూడా మిగలకుండా యంత్రసహాయంతో లాగివేసి డ్రమ్ములలో నింపి ఎగుమతి చేయుదురు. అప్పటి గోమాత విలాపము హృదయ విదారకము. తరువాత వాటిని వధించి వాటి మాంసమును చెడిపోకుండా డబ్బాలలో సీలువేసి విదేశములకు యెగుమతి చేయుదురు. ఈ విషయాలను వింటేనే మన మనస్సులు క్షోభించుచుండగా ఆ కఠినాత్ములకు చీమకుట్టినట్లుగా కూడా లేకుండుట ఆశ్చర్యము !

దయామూర్తియైన ఆ గోమాతను అంతగా హింసించినను ఆది మానవులకు సేవ చేయుచునే యున్నది. ఆ మాత ఓర్పుదప్పి యీ జాతిని శపించక ముందే భారతీయులు నిదుర మేల్కొని యీ హింసాకాండను ఆపుటకు ప్రయత్నించవలెను. లేకున్న యీ జాతికి యెంతదుర్గతి కలిగినను అది వారి స్వయంకృతాపరాధమే యగును.

## పంచగవ్యముల ఔషధ విశేషత

పంచగవ్యము లనగా ఆవు పాలు, ఆవు పెరుగు, ఆవు నెయ్యి, గోమూత్రము, గోమయము (పేడ) వీటిని సమభాగములుగా చేర్చిన పంచగవ్యమగునని యందురు. ఇది శరీరమును శుద్ధి చేసి కఫ, వాత, పిత్తములను సరిచేయును. అజీర్ణమును, పురాణజ్వరములను, అనేకరకముల నొప్పులను పోగొట్టునని ఆయుర్వేదాచార్యులందురు.

అనేక ప్రాయశ్చిత్త విధులలో పంచగవ్యములను లోనికి సేవించు విధానము గలదు. ఈ మధ్య రష్యాదేశంలో ప్రఖ్యాత వైజ్ఞానికుడు డా. శిరోవిచ్ పంచగవ్యములపై పరిశోధన జేయుచు యీ క్రింది ఫలితాలను ప్రకటించిరి.

1. ఆవుపాలలో రేడియోధార్మిక శక్తి నుండి రక్షణ కల్పించు శక్తి యెక్కువగా నున్నది. 2. ఆవు పేడతో అలికిన ప్రాంతము రేడియోధార్మిక శక్తిని నిరోధిస్తుంది. ఇంటిపైన ఆవు పేడతో అలికినయెడల ఆ యింటిలోనికి రేడియో ధార్మిక శక్తి ప్రవేశించుట లేదు. 3. ఆవు నేతిని అగ్నిలో వేసిన దాని పొగవలన (యజ్ఞవాయువు వలన) వాయుమండలములోని రేడియేషన్ యొక్క ప్రభావము తగ్గిపోవుచున్నట్లు కనబడుచున్నది. 4. వీటివలన అనేక రకములైన చర్మవ్యాధులు పూర్తిగా నయమగుచున్నవి. కొన్ని రోగములు కొంతనివారణ యగుచున్నవి. 5. ఆరోగ్యవంతులు వీటిని సేవించిన నిరోగులై దీర్ఘజీవనులగు అవకాశమున్నది.

పంచగవ్యములను విడివిడిగా వాడిన అవి ఎన్నోవ్యాధులకు దివ్యౌషధములగును. గోవు ఒక విచిత్రమైన జంతువు. దాని శరీరంలోని ప్రతీ అవయవము పవిత్రమైనదియు, ఇతరులను పవిత్రపరచునదియునై యున్నది. కనుక వీటిని విడివిడిగా తెలుసుకొందము.

## ఆవుపాలలో విశేషత

నేటి నవనాగరిక భారతీయులు ఆర్థిక దృష్టితో ఆవు పాలకన్న గేదె పాలు మంచివని వాదింతురు. వేష భాషలలో సభ్యతా సంస్కృతులలో గ్రుడ్డిగా విదేశీయుల ననుకరించు వీరు పాల విషయంలో విదేశీయుల నెందుకనుకరించరో తెలియకున్నది. నేడు ఆర్థికంగా, వైజ్ఞానికంగా అభివృద్ధి జెందిన దేశాలలో అంతటా ఆవుపాలే ఉపయోగింతురు. ఆవుపాల వలననే వారికి శరీర సౌష్టవము, బుద్ధి వికాసము కలుగుచున్నది. ఆటలలో, సాహస యాత్రలలో, వైజ్ఞానిక రంగంలోకూడ వారే అగ్రగాములు. ఆరోగ్య దృష్టితోను, బుద్ధి వికాసదృష్టితోను, ఆర్థిక దృష్టితోను అన్ని పాలకంటే ఆవుపాలే శ్రేష్ఠము.

రోగులకు, పిల్లలకు గేదెపాలకన్నా ఆవుపాలు ఎంతో ఉపయోగ కరముగా నుండును. దానికి కారణము ఆవుపాలు తల్లిపాలతో సమానమైన పోషక సమ్మేళనములు కలిగి యుండుటచే త్వరగా జీర్ణమై శరీరధాతువులలో

కలిసి పోతాయి. గోసంతానమైన ఎద్దులు బరువు మోసేందుకు దున్నపోతులకంటే ఎక్కువగా ఉపయోగపడతాయి. ఎంత ఎండలోనైనా అవి పనిచేయగలవు. దున్నపోతులు కొద్ది ఎండకే ఆయాసపడిపోతాయి. కొద్ది నీరు కనబడిన వెంటనే ఆ బురదలోకి వెళ్ళి చతికిలపడతాయి. బండికి కట్టినా అవి అదే పని చేస్తాయి. ఆంగ్లేయ పరిపాలన కాలంలో ఉదయం పది గంటల నుండి సాయంత్రం నాలుగు గంటల వరకు ప్రమాదాలు నివారించుటకు దున్నపోతులను బండికి కట్టకూడదనే నియమం ఉండేది.

ఆర్థిక దృష్టితో చూసినా గేదెలకన్న ఆవులే యెక్కువ లాభదాయకములు. ఆవు 280 రోజులలో (మానవ స్త్రీతో సమానంగా) యీనుతుంది. కాని, గేదె 310 రోజులకుగాని ఈనదు. అనగా ఒకమాసం యెక్కువగా గేదెను మేపవలసి ఉంటుంది. ఆవుదూడలు రెండుమూడు సంవత్సరాలలో పెద్దవై గర్భం ధరిస్తాయి. కాని, గేదెలు మూడు, నాలుగు సంవత్సరాలకు గాని గర్భం ధరించవు. అందువల్ల ఒక సంవత్సరం యెక్కువకాలం గేదెను మేపవలసి ఉంటుంది. మేత విషయంలో ఆవు కంటె గేదె యెక్కువ మేత మేస్తుంది. ఆవు రోజుకు 33 1/2 కిలోల మేత మేస్తే, గేదె 43.02 కిలోల మేత మేసినట్లు నైనితాల్‌లో చేసిన పరిశోధనలో తేలింది. నివాసానికి ఆవుకు కావలసిన చోటు కంటె గేదెకు యెక్కువ చోటు కావలసి ఉంటుంది. ఆవు ఖరీదు కన్న గేదె ఖరీదు యెక్కువగా ఉంటుంది. గేదెల్ని యెక్కడ పడితే అక్కడ కట్టివేసేందుకు వీలుపడదు. ఆవుల్ని యెక్కడ పడితే అక్కడ కట్టివేయవచ్చును. అవి శుభ్రంగా ఉంటాయి. గోవు ఒక విశ్వసనీయమైన జంతువు. నీటి ప్రవాహంలో చిక్కుకొనిన మనం ఆవుతోక పట్టుకొనిన అది నదిని దాటుటయేగాక మనలను ఒడ్డుకు జేర్చును. గేదెతోక పుచ్చుకొనిన అది చతికిల బడుటయే గాక మనను కూడా ముంచివేయును.

నైనితాల్‌లో డా. జగదీశ చంద్రగుప్తగారు 12 హర్యానా ఆవులను, 12 ముఱ్ఱాజాతి గేదెలను తీసుకొని పి.హెచ్‌డి అధ్యయనం చేయగా గేదెల పాలకంటే ఆవులపాలు పది లీటర్లు ప్రతిరోజు యెక్కువగా లభించాయి. ఆవులు

తక్కువగా మేత మేసి యెక్కువ పాలనిచ్చినట్లు, రెండవ పర్యాయం ఒక యేడాది లోపునే ఈని పాలు యిచ్చినట్లు తెలిసినది. అంతేగాక, ఆవుపాలను, గేదె పాలను తూకం వేసి చూడగా రెండింటి బరువు సమానమని తేలింది. గేదెలు రెండవ పర్యాయం 18 నెలల 24 రోజులకు గాని ఈనలేదు. ఆవు దూడలన్నీ బ్రతికాయి. గేదె దూడలు 50% చనిపోయాయి. గేదెలలో అరుగుదల ఖర్చు (depreciation value) యెక్కువ అని తేలింది. అందుచే ఆర్థిక దృష్టితో కూడా గేదె కన్న ఆవు లాభకారి.

గో క్షీరంలో యే జంతువు పాలలోను లేని ఒక విషనాశక పదార్థమున్నదనియు, అది క్రిమి సంహారకమందులలో ఉపయోగించే ఆర్సెనిక్ మొదలగు మందులను కూడా (ఆహారము ద్వారా మన శరీరములో ప్రవేశించినవాటిని) నశింపజేయగలదనియు అమెరికా శాస్త్రవేత్త డా. ఎస్. ఎ. ప్రోఫుల్ చెప్పుచున్నారు.

విదేశీ పర్యటన చేసివచ్చిన గొప్పకవి యోగియునైన శుద్ధానందస్వామి "స్విట్జర్లాండ్, బెల్జియమ్, స్వీడన్, ఇంగ్లాండ్ మఱియు అమెరికాలలో ఆవుపాలు సమృద్ధిగా దొరుకు చున్నవి. అచట విద్యుత్ యంత్రాలతో ఆవుపాలను పిండుదురు. పెరుగు, వెన్న, నెయ్యి తయారు చేయుదురు. అచటి ప్రజలు మిక్కుటముగా వాటిని తిందురు. అచట అవి పొంగి పొరలి ప్రవహించుచున్నవి. కాని, ఒకప్పుడు గోపాలకృష్ణుని సమయమున పొంగి ప్రవహించిన యీ గో సంపద నేడు విదేశీయుల పాలైనది. ఇంగ్లాండులో ప్రతి ఐదుగురికి ఒక గోవు ఉన్నది. కాని, నేటి భారత దేశ పరిస్థితి దీనికి విపరీతముగా నున్నది. ప్రజలదృష్టి ఆ వైపునకే మరలుటలేదు. అంతకన్న దురదృష్టకరం యీ భారతావనిపై గో మాత క్రూరంగా హింసింపబడుచున్నది." అని ఆవేదన జెందుచు భారతీయులకు పన్నెండు సూత్రాలలో గో సమృద్ధి ప్రణాళిక నొకదానిని ఉపదేశించిరి.

గో క్షీరమును గుఱించి సుశ్రుతుడు సూత్రస్థానంలో యీ విధముగా వివరించెను.

**'అల్పా భిష్యంది గోక్షీరం స్నిగ్ధం గురు రసాయనమ్**

**రక్త పిత్త హరం శీతం మధురం రసపాకయో:**
**జీవనీయం తథా వాతపిత్తఘ్నం పరమం స్మృతమ్**

(సుశ్రుత 49-51)

ఆవుపాలు అభిష్యంది గుణము లేనివై స్నిగ్ధములై గురుగుణము కలిగి రసాయనములుగా నుండును. మఱియు రక్తపిత్తములను హరించును. శీత వీర్యమును కలిగించును. మధురరసము, మధురవిపాకము గలవి. జీవశక్తిని పెంచును. వాతపిత్తములను హరించుటలో ఉత్తమమైనవి.

భావ ప్రకాశంలో ఆవుపాలను గూర్చి యీ విధంగా వర్ణింప బడినది.

**మందాగ్నీనాం కృశానాఞ్చ విశేషదుతి సారినామ్**
**ఉత్సాహ దీపనం బల్యం మధురం వాతనాశనమ్**

ఆవుపాలు మందాగ్నిని అనగా అజీర్ణమును పోగొట్టును. కృశించిన వారికి, అతిసార రోగులకు ఉత్సాహమును, జఠరాగ్నిని, బలమును పెంచును. దీపనమును, వాత నాశనమును గావించి పుష్టిని జేయును.

ఆవులలో వివిధ రంగులుండును. వీటి పాలలో కూడ కొన్ని సూక్ష్మమైన గుణభేదములుండును. దీర్ఘకాలం వైద్య విద్వాంసులు పరిశోధనలు జరిపి ఆ భేదములను యీ విధముగా వివరించిరి. తెల్లఆవు పాలు వాతహరములు - మిగిలిన ఆవుపాలకన్నా కొంత చిక్కదనమును కలిగియుండును. నల్ల ఆవుపాలు పిత్తహరములు, అన్నిటికన్న మంచిది. పక్షవాత రోగులకు యెక్కువ లాభదాయకము. ఎఱ్ఱ ఆవుపాలు కఫ నాశకములు, వాతరోగులకు కూడా గుణకారి. చారలు గల ఆవుపాలు వాత పిత్తములను, ఉదర రోగములను పోగొట్టి వీర్య వృద్ధిని కలిగించును. పసుపురంగు ఆవులపాలు అధికోష్ణము, అధికశీతలములచే గలుగు రోగముల నుపశమింపజేయును. కపిల గోవుల పాలు కంటికి మంచివి. త్రిదోషహరములు. సర్వోత్కృష్టములు. అవి మేయు మేతను బట్టి, త్రాగినవారి తత్త్వములనుబట్టి పై గుణములలో కొద్ది హెచ్చు తగ్గులు కలుగుచుండును. అరుదుగా కొన్ని తత్త్వములవారికి ఆవుపాలు వేడి చేయును. ప్రకృతి వైద్యానుభవమునుబట్టి అట్టివారుకూడా కొద్ది కొద్దిగా

ఆవుపాలను సేవించి అలవాటు చేసికొనవచ్చును.

అమెరికాలోని ఇలినియాస్ వ్యవసాయ శాఖ ప్రచురించిన "THE COW IS A MOST WONDERFULL LABORATORY" అను గ్రంథంలో గోవువలన కలుగు లాభాలు విస్తృతంగా వర్ణింపబడినవి. అమెరికా నిపుణుల అభిప్రాయం ప్రకారం – ఆవులు గడ్డి చొప్ప మొదలుగా గల పదార్థాల యందలి చిన్న చిన్న దోషాలను కూడా జీర్ణం చేసుకుంటాయి. కాని, వాటి పాలలో ఈ విషపదార్థాలు ఏ మాత్రము నుండవు.

రష్యాయందలి విజ్ఞానవేత్తలు కూడా గో క్షీరం, గో ఘృతం, గో దధి ఎంతో ఉపయోగకరమైనవని నిర్ణయించారు. పాలిచ్చే నాలుగు కాళ్ళ జంతువులలో ఒక్క ఆవు యొక్క ప్రేగు మాత్రమే 80 అడుగుల పొడవుంటుంది. తను నమిలి తినే ఆహారాన్ని గోవులు ఆ ప్రేగులో నిలువచేసి ఉంచగలుగుతాయి. ఆ సారాన్ని పాల రూపంలో మనకందజేస్తాయి.

## ఆవుపాలతో కొన్ని చికిత్సలు

ఆవుపాలలో యెక్కువ చక్కెర వేసుకొని త్రాగిన జ్వరములు తగ్గును. దీర్ఘ జ్వరములలో ఆవుపాలలో ఆవునెయ్యి, శొంఠి, ఎండు ద్రాక్ష పండ్లు, ఖర్జూరకాయలు వేసి మరగించి త్రాగిన గుణకారిగా నుండును. మధుమేహరోగులు వేడి ఆవుపాలలో బెల్లము మితముగా వేసుకొని త్రాగుట మంచిది. కండ్ల నొప్పులకు, బాధలకు పచ్చి ఆవుపాలలో తెల్లటి శుభ్రమైన వస్త్రమును తడిపి కొద్దిగా పిండి కండ్లపై వేసుకొని పరుండిన తొందరలోనే బాధలు ఉపశమించును. సౌందర్య వృద్ధికి వేడి ఆవుపాలలో ఆవునెయ్యి, తేనె కలిపి త్రాగుట మంచిది. వేడి ఆవుపాలలో ఎండుద్రాక్ష, ఖర్జూరకాయలు, మల్హటి, పిప్పళ్లు మరియు ఆవునెయ్యి కలిపి త్రాగిన గాయములు త్వరగా మానిపోవును. ఎముకలు విరిగినప్పుడు గోధుమ పిండి, లక్క, అర్జునపట్ట, ఆవునెయ్యి, ఆవుపాలతో కలిపి యెముక విరిగిన చోట పట్టీ కట్టవలెను. కొద్దిరోజులలో యెముకలు అతుకుకొనును. వేడి ఆవుపాలలో మిరియాలు,

పటిక బెల్లము వేసుకొని త్రాగిన జలుబు తగ్గును. దీర్ఘకాల తలనొప్పులకు ఆవుపాలలో దూదిని తడిపి తలపైన (మాడపైన) వేసికొనవలెను. ప్రతిరోజు తలస్నానము చేసి ఆవువెన్నతో మర్దన చేసికొనవలెను. దీనివలన చాలా లాభములు కలుగును. హృదయరోగులకు, పాండురోగులకు ఎల్లఆవుపాలే మంచివని చెప్పుదురు. అమృతమువంటివి. అందుచే అన్ని పాలకన్న ఆవుపాలు శ్రేష్ఠమైనవి. వస్తుగుణ దీపికలందు గోదుగ్ధ లాభాలను వివరించు యెన్నో శ్లోకములు కలవు. ప్రకృతివైద్యంలో క్షీర చికిత్సతో యెన్నో అజీర్ణవ్యాధులను, కృశించిన రోగాలను బాగు చేయుదురు. మన దేశంలోను, విదేశాలలోను క్షీరచికిత్సలో ఆవుపాలనే వాడుదురు. గ్రంథ విస్తరణ భీతిచే కొన్నిటిని మాత్రమే యిచట తెలుపుట జరిగినది.

## ఆవు పెరుగు

**స్నిగ్ధం విపాకే మధురం దీపనం బలవర్ధనమ్ ।**
**వాతాపహం పవిత్రం చ దధి గవ్యం రుచి ప్రదమ్ ॥**

(సుశ్రుతం - సూత్ర.)

ఆవు పెరుగు స్నిగ్ధమై విపాకమునందు (జీర్ణరసములతో కలిసి) మధురముగా మారును. ఇది జఠరాగ్నిని, బలమును పెంచును. వాతమును హరించును. అన్న హితవును కలిగించును.

రాజ నిఘంటువు నందును, భావ ప్రకాశము నందును కూడా యిట్లే చెప్పబడినది. ఇది తాపమును, దాహమును అణచివేయును. తక్కిన పెరుగులన్నిటి కన్నను ఆవు పెరుగే యెక్కువ గుణవంతమై యుండును. గుణకారి అని యెక్కువ సేవించుట మంచిది కాదు. అట్లు సేవించిన కొన్ని దోషములు కలుగును. అప్పుడు వేడినీళ్ళు, జీలకఱ్ఱ, శొంఠిపొడి, బెల్లము, ఉప్పు మొదలగునవి విరుగుళ్ళుగా ఉపయోగపడును. కొందరికి వేడి చేయును. అట్టి వారు ఆవు మజ్జిగను వాడుట మంచిది.

## ఆవు పెరుగుతో కొన్ని చికిత్సలు

పార్శ్వపు నొప్పి గలవారు కాచిన ఆవుపాలలో అన్నము వేసి తోడు పెట్టి మరునాడు సూర్యోదయపూర్వమే తినిన పార్శ్వపు నొప్పి పోవును. అట్లు మూడు రోజులు తినవలెను.

## ఆవు మజ్జిగ

**న తక్ర సేవీ వ్యథతే కదాచిత్**
**న తక్ర దగ్ధాః ప్రభవంతి రోగాః**

అనగా నిత్యం మజ్జిగ త్రాగువాడు వ్యాధికి గురికాడు. రోగి సేవించిన ఆ వ్యాధి పెరుగకుండా నాపుచేయును. క్రమంగా రోగమును పోగొట్టును. నివారణానంతరము మజ్జిగను సేవించుచుండిన మరల ఆ వ్యాధి రాకుండా నాపుచేయు చుండును. "సర్వ రోగ హరం తక్రమ్" మజ్జిగ సర్వరోగములను పోగొట్టును. ఈ మాటలు అతిశయోక్తులుగా కానవచ్చినను కొంత సత్యము మాత్రము గలదు. పెరుగు కన్న చల్ల తేలికగా జీర్ణమగును. అగ్ని మాంద్యమును పోగొట్టి తినిన ఆహారమును జీర్ణము చేయును. అందు ఆవుచల్లలో విశేషగుణము లున్నట్లు వైద్య గ్రంథములందును కలదు.

**శ్లో. గవ్యమ్ త్రిదోష శమనమ్ పథ్యే శ్రేష్ఠం తదుచ్యతే ।**
**దీపనం రుచికృన్మేధ్యమ్ అర్శోదర వికారజిత్ ॥**

అనగా ఆవుచల్ల వాత పిత్త శ్లేష్మములనెడి త్రిదోషములను శమింప జేయును. అన్ని రోగములందును ఉత్తమమైన పథ్య వస్తువు. అగ్ని దీపనమును, రుచిని, బుద్ధిబలమును యిచ్చును. మూలవ్యాధుల, ఉదరవ్యాధుల వికారము లన్నియు హరించును.

అందు చేతనే పెద్దలు **"యథా స్వర్గాణా మమృతం సుఖాయ, తథా నరాణాం భువి తక్ర మాహుః"**

'ఎట్లు దేవతలకు అమృతము సుఖము నిచ్చునో, అట్లే పృథివీ

మానవులకు తక్రము (చల్ల) సుఖము నిచ్చును' అని చెప్పుదురు.

**శ్లో. రుచకాగ్ని మరీచీనాం చూర్ణం సత్రేణ సంవితమ్ ।**
**గ్రహణీ ఉదర గుల్మానం క్ష్మణ్మాంద్య ప్లీహ నాశకృత్ ॥**

ఆవు మజ్జిగలో నల్లఉప్పు, పంచాంగములతో కూడిన నల్లచిత్రక చూర్ణము కలిపి సేవించిన గ్రహణి (బంక విరోచనములు), జలోదరము, జీర్ణాశయ వ్రణములు, అజీర్ణము, ప్లీహవ్యాధులు పోవును. పూజ్య వినోబాభావేగారు 'తక్రం తారకం' అనే పుస్తకంలో ఆవు మజ్జిగవల్ల చాలా రోగాలు నయమగునని వ్రాశారు. ఈ మధ్య ఉజ్జయిని మునిసిపాలిటీవారి పరిశోధనలో ఆశ్చర్యకరంగా పెరుగుతో తిన్న బాలుర కన్నా వెన్న తీసిన మజ్జిగతో తిన్న బాలుర బరువు యెక్కువ పెరిగినది.

## ఆవు వెన్న

ఆవు వెన్నలో చాలా తేలికగా జీర్ణమగు క్రొవ్వు కలదు. ఈ క్రొవ్వు మన శరీరంలో మన క్రొవ్వుగా మారి సౌందర్యమును కలుగజేయును. పసిమి వన్నెను కలిగించును. చర్మమునకు రాచుకొనిన నిగనిగలాడునట్లు చేయును. నెయ్యిని జీర్ణము చేసుకోలేనివారు వెన్నను సేవించుట మంచిది. వైద్య నిఘంటువులో దీని గుణము లిట్లు వర్ణింపబడినవి.

**శ్లో. నవనీతం హితం గవ్యం వృష్యం వర్ణ బలాగ్ని కృత్**
**సంగ్రాహి వాత పిత్తాసృ క్షయార్శోర్దిత కాసజిత్**
**తద్ధితం బాలకే వృద్ధే విశేషా దమృతం శిశోః**

(నిఘంటు సారము)

అనగా ఆవువెన్న అందరకు హితమైనది. వీర్యపుష్టిని, బలమును, శరీరమునకు బలుపును (పుష్టిని), అగ్ని దీపనమును కలిగించును. వాతవ్యాధులు, పిత్తరోగములు, రక్తవికారములు, క్షయ, మూలవ్యాధులు, అర్దితములు (నాడీవ్యాధులు), ఉబ్బసము, త్రిదీపజనితములగు వికారములు, నేత్ర వ్యాధులు మొదలగు వానిని శమింప జేయును. విశేషించి పిల్లలకు,

ముసలి వారికి, గర్భిణీ స్త్రీలకు, దుర్బలులకు అమృతము వంటిది.

ఇంతేగాక, యిది మేహ తాపములను, ఉష్ణాధిక్యతచే కలుగు దగ్గులను పోగొట్టును. ఆవువెన్నను వేడినీళ్ళతో మరగించి పుచ్చుకొనిన లిక్విడ్ పేరాఫిన్ వలె మలబద్ధమును పోగొట్టును.

## ఆవు నెయ్యి

ఆవునేతికి సంస్కృత భాషలో "ఆజ్యము, సర్పి" అను రెండు పేర్లు కలవు. 'ఆజ్య' మనగా **"ఆ సమంతాత్ జయంతి అసురాన్ అనేన"** దేని వలన వాతావరణంలోని ప్రాణులకు శత్రువులైన రోగక్రిములు నశింపబడునో అది ఆజ్యము అని నిరుక్త నిర్వచనము. 'సర్పి' అను పదము "సృ గతౌ" అను ధాతువుచే తయారగును. 'సర్ప' మను పదముకూడ నిదే ధాతువుతో తయారగును. పాములు గాలిలోని విషవాయువులను స్వీకరించి విషముగా మార్చి తమ రక్షణార్థం కోరలలో ధరించు నట్లే సర్పి శరీరము లోని విషములను, వాతావరణములోని విషములను హరించి వేయును. ఆవునేతిని గూర్చి వైద్య గ్రంథములలో యీ విధముగా వర్ణింపబడెను–

శ్లో. **ధీ కాంతిస్మృతిదాయకం బలకరం మేధాప్రదం పుష్టిదమ్,**
**వాతశ్లేష్మహరం విపాకమధురం, పిత్తాపహం హృద్ధితం,**
**వహ్నేర్వృద్ధికరం శ్రమోపశమనం వృష్యం వపు స్థైర్యదం,**
**గవ్యం హవ్యతమం ఘృతం బహుగుణం భోగ్యం భవేద్భాగ్యతః**

ఆవు నేయి బుద్ధిబలమును, కాంతివృద్ధిని, జ్ఞాపకశక్తిని, బలమును, మేధను, బలుపును నొసంగును. వాత శ్లేష్మ రోగముల నుప శమింప జేయును. మఱియు నియ్యది పాకమున మధురమై యుండును. పిత్తముల శాంతి నొందించి హృదయమునకు హితకరమై జఠరాగ్ని నుద్దీపింప జేయును. శ్రమాయాసముల పోగొట్టును. శుక్రవృద్ధి నొసంగును. శరీరమునకు స్థిరత నొసంగును. హవ్యములుగా అగ్నిలో వ్రేల్వబడు వస్తువులలో కెల్ల నియ్యది మిక్కిలి శ్రేష్ఠమైనదియు, విస్తారమగు గుణములు కలదియు, ఎంతటి

అదృష్టవంతులకోగాని అనుభవించు భాగ్యము కలుగదనియు నని దీని తాత్పర్యము. సుశ్రుతాచార్యుడు కూడా యిట్లే వర్ణించిరి.

శ్లో. విపాకే మధురం శీతం వాతపిత్త విషాపహమ్
చక్షుషర్పిమగ్ర్యం బల్యం చ గవ్యం సర్పిర్గుణోత్తరమ్
(సుశ్రుత. సూత్ర. 68)

ఆవు నెయ్యి మధుర విపాకము, శీతవీర్యము గలది. వాతపిత్తములను, శరీరములోని విషములను బోగొట్టును. కంటికి చాలా మేలుచేయును. బలము నిచ్చును. అన్ని నేతులకంటెను ఆవునెయ్యి శ్రేష్టతమమై యుండును.

అనేక ఆయుర్వేద యోగములలో (మందులలో) ఆవు నేతిని ఉపయోగింతురు. కొన్ని ప్రాంతాలలో పాము కరిచిన వారిచే ఆవు నేతిని త్రాగింతురు. దాని వలన విషహరణము జరుగునని చెప్పుదురు. ఇది మెదడుపైనుండు గ్రెమేటరును వృద్ధి చేసి జ్ఞాపక శక్తిని పెంచును.

విశేషించి ఆవు నేతితో విధి పూర్వకముగా హోమము చేసిన వాతావరణ కాలుష్యము దూరమగును. పుత్రకామేష్టి, వర్షేష్టి మొదలగు యజ్ఞములలో ఆవు నేతిని వాడుదురు.

(ఈ విషయములను వివరముగా తెలుసుకొన గోరు వారు నాచే సంకలనము చేయబడిన "అగ్ని హోత్రము - వైజ్ఞానిక స్వరూపము" అను పుస్తకమును చదువ గోరెదను.)

## గో మూత్రము

దీనిని ఆవుపంచిత మనియు అందురు. దీనిని ఔషధముగా లోపలకు పుచ్చుకొనిన చాలా రోగములు నయమగును. ఇట్లు చేయుట మనకు అసహ్యమనిపించును. అయినను యిది అమృతము వలె పనిజేయును. కొన్ని ప్రాయశ్చిత్త విధులందు దీనిని లోపలకు త్రాగించు విధానము కలదు. ఆయుర్వేద గ్రంథములందు దీని గుణములిట్లు వర్ణింప బడినవి.

గోమూత్రం కటు తీక్ష్ణోష్ణం సక్షారత్వాన్న వాతలమ్,
లఘ్వగ్ని దీపనం మేధ్యం పిత్తలమ్ కఫవాతనుత్
శూలగుల్మోదరానాహ విరేకా స్థాపనాదిషు,
మూత్ర ప్రయోగ సాధ్యేషు గవ్యం మూత్రం ప్రయోజయేత్.
(సుశ్రుత. సూత్ర. 222)

గోమూత్రము కొంచెము కారముగను, ఘాటుగను ఉండి ఉప్పగాను, వగరుగాను ఉండును. తీక్షణగుణము కలది. కొద్దిగా వాతము చేయును. అగ్నిదీపనము చేయును. జ్ఞాపకశక్తిని పెంచును. కఫ వాతములను పోగొట్టును. శూల, గుల్మము, ఉదరము, విరేచనములు మొదలగు వ్యాధులందును, మూత్రరోగములందును గోమూత్రమునే ఉపయోగింతురు. పిచ్చి, ఉన్మాదము మొదలగు మానసిక రోగములను యిది పోగొట్టును. నేత్ర సంబంధములగు జబ్బులను, ఉబ్బసము, క్షయ మొదలగు వ్యాధులను యిది నశింప జేయును.

దీని మూత్రంలో అనేక లోహ లవణములుండును. ఇవి భూసారమును వృద్ధి పరచును. దీనిని అనుపాన భేదముతో ఒక మందుగా వాడిన మలేరియా, వాంతులు, విరేచనములు, టైఫాయిడ్, సర్పవిషములు పోవునని కొందరి అనుభవము. ఆయుర్వేదములో అనేక లోహములను శుద్ధి పరచుటకు గోమూత్రమును వాడుదురు.

ఇది శరీరంలోని సప్త ధాతువులను శుద్ధి పరచి ఎట్టి జ్వరమునైనను హరించును. జలోదరము నివారణ యగును. దీనిని కొద్దిగా వేడిచేసి లోనికి పుచ్చుకొనిన (తగుమాత్రము) విరేచనకారిగా పనిజేయును. దీనితో కంటి స్నానము (కండ్లను తుడుచుకొనిన) నేత్రజ్యోతి వృద్ధి యగును. చెవిలో వేసుకొనిన చీముకారుట మొదలగు దోషములు పోవును. ప్లీహ రోగములందు యిది రామబాణమువలె పనిచేయును. ఉదయ సాయంకాలములయందు రెండు తులముల గోమూత్రమును సేవించిన ఒక వారములో గొప్ప ఉపశాంతి లభించును. రక్తమాలిన్యములు, దురద, కుష్ఠురోగము, చర్మరోగములు, కడుపులో క్రిములు, వాంతులు, కఫము, కడుపులో గ్యాస్ మొదలగు అనేక

జబ్బులకు గోమూత్రము ఔషధముగా పనిచేయునని ఆయుర్వేదాచార్యులు ప్రసిద్ధ వైద్యులు సురేష్ చతుర్వేది అంటున్నారు. ఈ మధ్య లభించిన అచ్చుపడని ఒక వైద్యగ్రంథంలో స్త్రీల జబ్బులకు, మధుమేహము, క్షయ, పక్షవాతము, గుండె జబ్బు, పుట్టవ్రణము (కాన్సరు) మొదలగు జబ్బులకుకూడా గోమూత్రము అమోఘముగా పనిచేయునని వ్రాయబడినది.

## గోమయము (ఆవు పేడ)

దీనిని గోవిట్, భూమి లేపనము అని గూడా అందురు. గ్రామాలలో గోమయంతో యిండ్లను అలుకుకొనుటయు, వాకిళ్లముందు కల్లాపు చల్లుటయు కలదు. దీని వలన దుమ్ము లేవకుండుటయేగాక అనేక రోగక్రిములు నశించును. దుర్గంధము బోవును. తేళ్లు మొదలగు చిన్న చిన్న విషకీటకములు రాకుండును. దోమలను పారద్రోలును. దీనిని ఎండబెట్టి పొడిచేసిన 'గోమయ చూర్ణ' మగును. ఇది అనేక వ్యాధులకు మందుగా పనిచేయునని చరక సంహిత యందు ప్రత్యేకముగా ఒక అధ్యాయము వ్రాయబడినది. దానికి 'గోమయ చూర్ణేయాధ్యాయ" మని పేరు కూడా కలదు.

గోమయమును తైలములో కలిపి కాచి సిద్ధము చేసినట్టి తైలమును గోమయతైలమని యందురు. దీనిని గురించి 'భైషజ్య రత్నాకరము' నందు యిట్లు చెప్పబడినది.

**"గవాం శకృత్క్వాథ విపక్వ ముత్తమం హితం చ తైలం తిమిరేషు న స్తతః"**

అనగా ఆవులయొక్క పేడరసముతో కలిపి కాచి సిద్ధము చేసినట్టి తైలము అత్యుత్తమమైనట్టిదియేగాక రేచీకటిని పోగొట్టుటలో ప్రశస్తమైనదియై యుండను. మఱికొన్ని గ్రంథాలలో తైలమునకు బదులుగా గోమయమును నేతితో కలిపి కాచి సిద్ధము చేయవలెననియు చెప్పబడినది. దానిని 'గోఘృతాద్య తైలము' అందురు. ఇది కూడ పై గుణములనే కలిగి యుండును. శ్రీహరిరామ వైద్య, ఆయుర్వేదచార్యులు ఒక వ్యాసంలో "నిరాకరోత్తి నక్తంధం స గోమయ

రసాఖణాః - గోమయ రసంలో చిన్న పిప్పళ్లు అరగదీసి కంటికి కాటుకగా పెట్టుకొనిన రేచీకటి దూరమగు" నని వ్రాసిరి. "గోమయమును వంటికి రాచుకొనిన అనేక చర్మవ్యాధులు నయమగును. ఎండిన గోమయమును శరీరమునకు రుద్దుకొనిన చలి దూరమగును. ఎండిన పిడక ముక్కలను బట్టలలో నుంచిన పురుగులు పుట్ట" వని వ్రాసిరి.

ఆవు పిడకలతో కొన్ని ఔషధాలకు పుటములు పెట్టవలెనను విధానము ఆయుర్వేదమునందు గలదు. విశేషంగా ఆవు పేడ గొప్ప యెరువు. మహారాష్ట్ర ప్రాంతంలో "డా. కుమారప్ప గోవర్ధన సంస్థ" సంయోజకులు శ్రీ నారాయణ రావు పండరీ పాండేగారు ఆవు పేడతో యెరువును తయారు చేయు విధానమును రూపొందించి విజయమును సాధించిరి. ఒక్క ఆవు వల్ల లభించే పేడతో ఒక సంవత్సరంలో 80 టన్నుల యెరువును తయారు చేయవచ్చునని వారు గట్టిగా చెప్పుచున్నారు. ఆ ఎరువులో నత్రజని 0.5 నుండి 1.5%, మరో ద్రవ్యం 0.5 నుండి 0.9% మిగిలిన సూక్ష్మద్రవ్యాలు 1.2 నుండి 1.4% ఉంటాయని నిరూపించారు.

దీనిని లెక్కలు కడితే ఒక సంవత్సరంలో ఒక ఆవు వలన రూ. 17,885లు విలువ గల ఎరువు తయారగునని చెప్పుచున్నారు. రసాయనిక ఎరువులకన్నా యిది ఎంతో శ్రేష్ఠమైనది. రసాయనిక ఎరువుల వల్ల అమెరికాలో 28 కోట్ల ఎకరాల భూమి యెడారిగాను, 70 కోట్ల ఎకరాల భూమి బంజరుగాను మారిపోవుచున్నదని అమెరికా వ్యవసాయ శాఖ ప్రచురించిన "మిగిలిన భూమి సంరక్షణ" అనే పుస్తకంలో వ్రాశారు.

మహారాష్ట్రలోని పుసద్ "గో వర్ధన కేంద్రం" లో మహాత్మా గాంధీగారి శిష్యుడైన శ్రీ ఎన్. డి. పండరి పాండేగారు ఒక్క కిలో ఆవుపేడతో గడ్డి గాదములు చేర్చి 40 కిలోల మంచి యెరువును తయారు చేసి చూపించు చున్నారు.

గోబర్ గ్యాస్ వంటచెరకుగా చాలా ఉపయోగపడును. దీనిని డీజిల్ యింజను నడిపేందుకు కూడా ఉపయోగించ వచ్చునని 'గ్రామ విజ్ఞాన కేంద్రం'

ట్రాక్టర్లు యివి యివ్వలేవు కదా?" యని వారు యెదురు ప్రశ్న వేసిరట. ట్రాక్టర్లవలన వాతావరణ కాలుష్యం, వాటి కవసరమైన ఆయిల్ సమస్య మొదలగునవి ఎన్నో కలుగును. అంతకు మించి గోసంతతి లేకపోవుట వలన కృత్రిమ ఎరువులు వాడవలసి వచ్చును. అందువలన భూమి నిస్సారమగును. గో సంతతి వలన ఆ ప్రమాదము తప్పును. నేటికిని భారతదేశపు ఆర్థిక వ్యవస్థకు గో సంతతి చేకూరుస్తున్న బలం ఈ విధంగా నున్నది. ఒక సంవత్సరానికి పాలద్వారా 7,000 కోట్ల రూపాయలు, ఎద్దుల శక్తిద్వారా 6,000 కోట్ల రూపాయలు, గోమయం గోమూత్రపు యెరువు ద్వారా 5,000 కోట్ల రూపాయలు మొత్తం 18,000 కోట్లు లభిస్తున్నవి. మిగతా పాలిచ్చే జంతువుల కన్నా గోమాతలో ఉండే విశేషత యేమో ముందే తెలుసుకొని యున్నాము కదా !

ఇప్పుడు కొందరు అధిక లాభాలను గడించాలని సంకర జాతి ఆవులను తయారు చేస్తున్నారు. వీటిద్వారా పాలు ఎక్కువ లభించినా వాటి దూడలు వ్యవసాయానికి పనికి వచ్చుట లేదు. తొందరగా వ్యాధిగ్రస్త మగుచున్నవి. ఎండను ఓర్చుకొన లేకపోవుచున్నవి. కనుక అటువైపు మన దృష్టిని పోనీక దేశవాళీ గోసంతతినే వృద్ధి పరచుకొనుట అవసరము. అటువంటి దేశవాళీ గోజాతి యిప్పటికినీ ఉన్నదనియు, పుష్టికరమైన ఆబోతుతో దాటిస్తే చక్కటి గోజాతి లభించ గలదనియు తెలియుచున్నది. దీనితో బాటు మనమంతా కూడా హృదయ పూర్వకంగా గోరక్షణకు కొంత త్యాగం చేయాలి. పట్టణాలలో సాధ్యం కాకపోయినా పల్లెటూళ్ళలో ప్రతి యింటిలో గోసంరక్షణ జరగాలి. పట్టణాలలో కూడా భాగ్యవంతులు, విశాల గృహాలు కలవారు ఆవులను పోషించ వచ్చును. కుక్కలు మొదలగు పెంపుడు జంతువులమీద కనబరిచే ప్రేమ, శ్రద్ధలను గోమాతవైపు మరలిస్తే తమకు, దేశానికి, భావి తరాలకు యెంతో మేలు చేసిన వారగుదురు. సామాన్యులమైన మనం కూడా కొంత ఎక్కువ ధర చెల్లించి ఆవు పాలనే కావాలని కోరితే పాల ఉత్పత్తి కేంద్రాలలో గోవులను పెంచాలనే ఆలోచన కలుగుతుంది.

గోశాలలో పాలిచ్చే ఆవుల పోషణ తేలిక అవుతుందికాని పాలు ఇవ్వని ఆవులను, వయసు మళ్లిన గోసంతతిని పోషించాలంటే చాలా సమస్యలు ఎదురవుతాయి. ఇలాంటి గోసంతతిని చూస్తూ చూస్తూ కసాయి వాళ్లకు అప్పగించలేక రోడ్లమీద వదిలేస్తూ ఉంటారు. అట్టి ఆవులు దొరికిన చెత్తా చెదారం తిని జబ్బుపడి చనిపోతూ ఉంటాయి. లేదా కసాయి చేతుల్లోబడి నరికి వేయబడిపోతాయి. పేద రైతులు విధిలేక వీటిని అమ్మివేయటం జరుగుతున్నది. ఇట్టి ఆవులకొరకు అడవి ప్రాంతాలలో గోశాలలు నిర్మించి వాటి పోషణకు యేర్పాట్లు చేయాలి. అవి ముసలివైనా వాటి వల్ల మనకు పెద్ద నష్టం రాదు. అవి కొద్దిగా మేతమేసి మల మూత్రాలను మనకిస్తాయి. వాటిని మనం సద్వినియోగపరచుకుంటే గోబర్ గ్యాస్ మరియు యెరువు లభిస్తాయి. మానవులుగా ఇట్టి యేర్పాట్లు చేయుట మన కర్తవ్యం. లేకున్న కృతఘ్నుల మగుదుము. ఏ తల్లి దండ్రుల వలన మన శరీరం పోషింప బడినదో అట్టి తల్లి దండ్రులను ముసలి వారైనను మనం పోషింతుము. అట్లే గోమాత వలన పోషింపబడిన మనము అవి ముసలివైనపుడు వాటిని సేవించటం మన ధర్మం.

ఇప్పటికీ గోభక్తులైన దాతలు కొందరున్నారు. కాని, సేవానిరతిగల కార్యకర్తలు చాలా తక్కువగా ఉన్నారు. ఉన్న కార్యకర్తలు కూడా పెత్తనం కోసం చూస్తున్నారేకాని సేవా తత్పరత లేదు. వారి ప్రవర్తన వలన ప్రజలలో విశ్వాసం తగ్గిపోతూ ఉంది. అయిననూ ఇప్పటికీ కొన్ని గోసంరక్షణశాలలు ఆదర్శవంతంగా పనిచేస్తున్నాయి. ఎంతోమంది కార్యకర్తలు గోరక్షణాందోళనలలో యెన్నెన్నో త్యాగాలు చేస్తున్నారు. అటువంటి వారిని మనం ప్రోత్సహించాలి. ప్రతీనెల మన ఆదాయంలో మన శక్తికొలది కొంత భాగాన్ని గోమాత సేవకు కేటాయించాలి. 'అఖిల భారత కృషీ గో సేవా సంఘం' వారు ఆదర్శవంతమైన సేవ చేస్తున్నారు. వారు గోగ్రాస్ చందాదారులుగా మిమ్ములను తీసుకుంటారు. సంవత్సరానికి కనీసము రూ.

51 లు చందా యివ్వగలిగితే మీరు చందాదారులు కావచ్చును. దానికి ప్రతిఫలంగా ఒక మాసపత్రిక మీకు ప్రతి నెలా ఉచితంగా అందుతుంది. "గోగ్రాస్" అని హిందీలోను "గోసేవ" అని తెలుగులోను ప్రచురణ జరుగుచున్నది. లేదా కేవలం పత్రిక చందా దారులుగా చేరవచ్చును. అందు గోమాత విశేషములు మరెన్నో తెలుసుకో గలరు.

ప్రభుత్వం కూడా తన ధర్మం తాను పాటించాలి. జాతిపిత గాంధీ మహాత్ముని ఋణము, సర్దార్ పటేల్, వినోభా భావే మొదలగు స్వాతంత్ర్య సమర యోధుల ఋణము తీర్చుకోవాలంటే వెంటనే ప్రభుత్వం సంపూర్ణ గోవధ నిషేధాన్ని అమలు పరచాలి. అంతేగాక, ప్రత్యామ్నాయంగా గోసంరక్షణ కేంద్రాలు ఏర్పాటుచేయాలి. అప్పుడే వారికి నిజమైన శ్రద్ధాంజలి అవుతుంది కాని, సభలు సమావేశాల వలన కాదు. గోవును 'జాతీయ పశువు'గా కేంద్ర ప్రభుత్వం ప్రకటించాలి. అప్పుడే దేశం ఉన్నతిని చెందుతుంది.

చివరిగా మహాభారతంలోని వ్యాసుని మాటలను మననం చేద్దాం.

శ్లో. **గావః ప్రతిష్ఠా భూతానాం తథా గావః పరాయణమ్,**
**గావః పుణ్యాః పవిత్రాశ్చ గోధనం పావనం తథా.**

సర్వ ప్రాణుల ప్రతిష్ఠ అభ్యున్నతి గోవులోనే యున్నది. అట్లే సర్వప్రాణుల పారమార్థికత గోవులోనే యున్నది.

గోవులు పుణ్య స్వరూపములు, పవిత్రమైనవి. గోధనము పవిత్రమైనది.

**గో మాతాకు జై**

**శమ్ ఇతి ఓ౩మ్**

# మహా పురుషుల దృష్టిలో గోమాత

శ్లో. గావః ప్రతిష్ఠా భూతానాం తథా గావః పరాయణమ్,
గావః పుణ్యాః పవిత్రాశ్చ గోధనం పావనం తథా.

1. "ప్రాణులన్నిటిలో గోవులే గౌరవప్రదమైనవి మరియు పరమార్థ సాధకములు. గో సేవయే పుణ్యము మరియు పవిత్రము. అట్లే గోధనమే శారీరక మానసిక ఆరోగ్యముల నిచ్చు పావన ఔషధము."

**-వేదవ్యాసుడు (మహాభారతము)**

2. "యహీ దే ఆగిఅ తురకన్ గహి ఖపాఊం,
గఉ ఘాత కా దోష్ జగ్ సే మిటాఊం !
యహీ ఆస్ పూరన్ కరో తుమ్ హమారీ,
మిటే కష్ట గౌ అన్ ఛుటే దోష్ భారీ !
యహీ బేనతీ ఖాస్ హమారీ సునీజై,
అసుర్ మారకర్ రచ్ఛ గౌ అన్ కరీజై !"

**-గురు గోవింద సింహ**

3. "ఓ శివాజీ! హిందూ (ఆర్య) జాతి కల్యాణం మరియు మానవజాతి ఆరోగ్యం కొరకు గోమాతను రక్షింపుము."

**-సమర్థ గురు రామదాసు**

4. 'ఆగచ్ఛ దేవీ కల్యాణీ శుభాం పూజాం గృహాణ చ'
'త్వం మాతా సర్వదేవానాం'
'నమో బ్రహ్మణ్యదేవాయ గో బ్రాహ్మణ హితాయ చ'

**-మహర్షి గణము**

5. "ఓ నా ప్రజలారా! చూడుడు. పొరబాటున కూడా మీరు గోవును అనాదరణ చేయుటగాని, గోవుకు హాని చేయ తలపెట్టుటగాని చేయవద్దు. ఇంతేకాదు, వాటిని ప్రేమతో, శ్రద్ధతో, కరుణతో సేవించుడు."

**-అశోకుడు (స్థూపములపై)**

6. "గోవు మొదలగు పశువుల నాశము రాజు మరియు ప్రజల నాశనమునకు హేతువగను." -మహర్షి దయానందుడు

7. "గోహంతకుని పట్టుకొని గ్రామ ప్రజలంతా అతని ముఖంపై ఉమ్ముడు. గోవులను చంపు దుర్మార్గు లెచ్చటనున్న వెదకి వెదకి చంపుడు." -బందా వీర బైరాగి

8. "ఓ నెపోలియన్ సేనాపతులారా! మీరు "గోమాంసం తినము " అని ప్రమాణము చేసిననే మిమ్ము నా సైన్యమున చేర్చుకొందును."
**-మహారాణా రణజిత్ సింహ**

9. "స్వాతంత్ర్యం వచ్చిన ఐదు నిముషాలలోనే ఒక కలంపోటుతో (శాసనంతో) గోహత్య నిలిపివేయుదుము."
**- మహాత్మా గాంధీ, సర్దార్ వల్లభాయి పటేల్ మరియు బాల గంగాధర తిలక్**

10. "స్వరాజ్యం కొరకైనను నేను గోరక్షణను విడిచిపెట్టలేను."
"గోరక్షణ వల్లనే మన జాతి, మన ధర్మము రక్షింపబడును."
"నా దృష్టిలో గో రక్షణ స్వరాజ్యసముపార్జన కంటే ఏమాత్రము తక్కువకాదు. అంతేకాదు, స్వరాజ్యప్రాప్తికన్నను గోరక్షణయే ఎక్కువయని భావింతును. గోహత్య మానవహత్యతో సమానమని నా వ్యక్తిగత అభిప్రాయము."
"గోరక్షణకొఱకు అవసరమైనచో తన ప్రాణాల నర్పింపనివాడు హిందు వెట్లగును?" **-మహాత్మాగాంధీ**

11. "నేను మృత్యువునైనను స్వీకరింతును గాని గోమాంసంతో తయారైన ఔషధమును సేవింపను."
**-మాతా కస్తూరిబా గాంధీ**

12. "ఓ భారతీయులారా! మన పిల్లలకు గో దుగ్ధమును త్రాగించుడు. అందుచే మన జాతి బలవీర్యాలతో ఫలించును. పుష్టించును."
**-పంజాబ్ కేసరి లాలా లజపతిరాయ్**

13. "సంపూర్ణ గోహత్యా నిరోధమే లోకుల ఆజ్ఞ. దీనిని ప్రధానమంత్రి అంగీకరించక తప్పదు."
"మనం గోవును రక్షింపలేకున్న స్వాతంత్ర్య ఫలసారమును పోగొట్టుకున్న వారమే అగుదుము."

**–ఆచార్య వినోభా భావే**

14. "భారత రాజ్యాంగంలో గోహత్యా నిషేధమే మొదటి అంశంగా నుండవలెను."

**–మదన్‌మోహన్‌జీ మాలవ్యా**

15. "నా ఆలోచన ఏమనగా ప్రజల ధార్మిక మృదు భావనలను అవహేళన చేయుట ఎంత మాత్రము సభ్యాచారము కాదు. భారతీయుల మస్తిష్కాలలో గోవుపట్ల పూజ్య భావం గలదు. గోహత్యా నిషేధమే వైజ్ఞానికము. హేతుబద్ధము అని వారి అభిమతము."

**–జయప్రకాశ్ నారాయణ (సర్వోదయ నేత)**

16. "గోవధ నిషేధమునకు గొప్ప జనాభిప్రాయం తయారు చేయవలసియున్నది. గో రక్షణయే మన జీవనాదర్శము. దీనినుండి విచలితులగుట మన బలహీనతయే. ఎన్నికలలో ఎవరు గోరక్షణ కొరకు ప్రతిజ్ఞ చేయుదురో వారికే ఓటు వేయవలెను. గోవధ జరుగుచున్నచో ప్రభుత్వం (రాజ్యం) నిలువలేదు."

**–రాజర్షి పురుషోత్తమదాస్ టాండన్**

17. "గోవులు మానవ సమాజానికి ఒక గొప్ప వరం. ఎచ్చట గోవులు చక్కగా పోషించబడుచు రక్షింపబడుచుండునో ఆ దేశపు భూములు గొప్పగా పండును. గృహములు ఉన్నతి చెందును. నాగరికత పురోగమించును."

**–బర్నార్డ్ మేక్‌ఫెడన్**

18. "నేను గొప్ప గోమాంస భక్షకుడను. అదియే నా బుద్ధి వినాశనమునకు కారణము."

**–షేక్స్పియర్ 'ట్వెల్త్‌నైట్' నాటకములో ఒక పాత్ర.**

19. "భారతదేశంలో పశువినాశానికి దోహదము చేసిన వారము
మనమే అని చెప్పుటకు సిగ్గుగా నున్నది."
"నేను దేశం లేకుండా పశువులున్నట్లు కల కనగలుగుదును. కాని, పశువులు లేని దేశమును ఊహించనైనా ఊహించలేను."

**-సర్ విలియమ్ వెడ్డర్ బర్న్**

20. "ఓ హుమాయూన్! నీవు హిందుస్తాన్‌లో రాజ్యం చేయగోరుదువేని గోవధ జరుగకుండా చేయుము." **-బాబర్**

21. "గోహంతకుల వ్రేళ్లను నరికివేయుదు. ఇది నా ఆజ్ఞ."

**-సామ్రాట్ అక్బర్**

22. "ప్రజలు గోహత్యానిషేధ శాసనం కోరుచున్నచో తప్పక గోవధను నిషేధించవలసినదే."

**-రఫిఅ అహ్మద్ కిదవాయి**

23. "గోవును వధించుటకన్న హిందువులతో స్నేహాన్ని కోరుటయే ప్రధానమైనది. అందుచే మహమ్మదీయులు గోవధనిషేధం పట్ల వ్యతిరేకించుట మూర్ఖత్వమే అగును.

**-సర్ సుల్తాన్ అహమద్‌ఖాన్, (ముస్లింలీగ్ సంస్థాపక అధ్యక్షుడు)**

24. "హిందువుల దృష్టిలో గోవు తల్లివంటిది. పూజనీయమైనది. అట్టి గోవును వధించినవారికి ఇచట (భారతదేశమున) మరణదండన విధింపబడుచుండెను." **-యాకూబీ యాత్రికుడు**

25. "గోక్షీరము గొప్పమందు. దాని నెయ్యి గొప్ప ఆరోగ్యప్రదాయిని. కానీ దాని మాంసము రోగకారకము."

**-హజరత్ మహమ్మద్**

**'గోమాతా విజయతామ్'**

**ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః**



## మహర్షి దయానంద సరస్వతి

ప్రియ పాఠకులారా !

19వ శతాబ్దంలో గోమహిమను గుర్తించిన మొదటి వ్యక్తి మహర్షి దయానందుడు.

ఈ 'గోమాత'ను చదివిన మీకు గోవు వలన కలుగు కొన్ని ప్రయోజనాలు తెలిసి యుండును. ఇంకను వివరంగా తెలుసుకోగోరువారు మహర్షి దయానందుని రచనలైన గోకరుణానిధి, ఋగ్యజుర్వేద భాష్యములు, సత్యార్థ ప్రకాశము మొదలగు గ్రంథములు మరియు ఆచార్య పిండీదాస్ గారి హిందీ రచన 'గా – విశ్వకీ – మా' చదవ గోరెదము. అవి అన్ని ఆర్యసమాజ మందిరాలలోను లభించును.

కేవలం ఈ పుస్తకం చదువుటయేగాక గోసంతతిని రక్షించుటకు, పోషించుటకు కృషిచేయగోరుచున్నాము. గోహత్యానిషేధ ఆందోళనలలో భాగస్వాము లగుచు, గోవును జాతీయపశువుగా ప్రభుత్వం ప్రకటించు వరకు విశ్రమించకుండుట మన బాధ్యత. అట్టి కార్యక్రమాలలో మీ సూచనలు తెలుపుచూ మాకు సహకరించగోరుచున్నాము.

**–ప్రకాశకులు**

# గాయత్రీ ఆశ్రమ ట్రస్టు ప్రచురణలు

వేదాలలో సూర్యకిరణ చికిత్స (40-00), వేదాలలో జలచికిత్స (20-00), వైదిక క్రాంతి పథం (15-00), దౌహృదిని (ఋషుల దృష్టిలో గర్భిణిస్త్రీ) (30-00), అగ్నిహోత్ర రాసాయనిక విశ్లేషణ (20-00), గర్భధాన విజ్ఞానము (50-00), మానవ ధర్మము (25-00), అశ్వినీ దేవతలు (20-00), సంధ్యా వందనము - వైజ్ఞానిక సమాలోచనము (20-00), అగ్నిహోత్ర ఆధ్యాత్మిక స్వరూపము (30-00), గంగాధర శివుడు (5-00), గోమాత (40-00), గాయత్రీ విజ్ఞానం (50-00), జననీ జన్మభూమిశ్చ స్వర్గాదపి గరీయసీ (60-00), స్వాతంత్ర్య నముపార్జనలో మహర్షి దయానందుడు (10-00), మన ఇతిహాసం (70-00), మన వేదశాస్త్రాల పరిచయం (50-00), చతుర్దశ భువనములు (10-00), ఐతరేయోపనిషత్తులోని సృష్టికథ (10-00), యుగపురుషుడు శ్రీకృష్ణుడు (8-00), ధర్మవీర్ పం. లేఖరామ్ (3-00), వేదాలలో అప్సరస గంధర్వులు (2-50), యజ్ఞోపవీత వైశిష్ట్యము (2-00), లక్ష్మీ సూక్తము (2-00), శాంతి ప్రార్థన (2-00), దగ్రేట్ గాయత్రి (2-00), వైదిక అర్థనీతి (2-00), స్వరాజ్య సంగ్రామంలో ఆర్యసమాజము (8-00), సత్యధర్మవిచారణ (6-00), వైదిక సంస్కృతిలో వానప్రస్థాశ్రమం (10-00), మరణానంతరం జీవుని ప్రయాణము (40-00), ప్రణవ స్తోత్రం (10-00), అహల్య రాయిగా మారలేదు (2-00), మాతాపుత్రికల జ్ఞానచర్చ (60-00), వేదాల వెలుగు చూపే ఆర్యసమాజము (20-00), చతుర్వేద సరస్వతీ సూక్తము (10-00), పురుష సూక్తము (20-00), వేదాలలో వర్షేష్టి విజ్ఞానం (25-00) ఈశావాస్యమిదం సర్వమ్ (35-00), వైదిక శాంతిపాఠం (వైజ్ఞానిక వ్యాఖ్య) (20-00), పండుగల పరమార్థం (40-00).

(20-1-2016)



గో భక్తుడు వీర శివాజీ




గో భక్తుడు మంగళ్ పాండే

**GOMATHA**
Gayatri Series No. 13

₹ 40/-




*Published by :*

**Gayatri Ashram Trust,**
Arya Samaj - Vyasnagar, Medibavi, Warasiguda,
Secunderabad - 500 061.